# శ్రీ కృష్ణానదీ పుష్కర మహాత్మ్యం

(శేతాశ్వత్థ వృక్షమయి నిలచిన శ్రీకృష్ణుని పాదముల నుండి ఉత్పన్నమయినది కృష్ణానది)



తుమ్మల లక్ష్మయ్య

## రచయిత పరిచయము...



పేరు : తుమ్మల లక్ష్మయ్య
ధర్మపత్ని : శ్రీమతి లక్ష్మీశ్వరమ్మ
జన్మస్థలం : రిమ్మనపూడి, పామర్రుమండలం, కృష్ణాజిల్లా.
జననం : జనవరి 1930
వృత్తి : ఉపాధ్యాయుడు (రిటైర్డు)
ప్రవృత్తి : ఆధ్యాత్మిక గ్రంథములు రచన
జనకులు : తేజోమూర్తి బ్రహ్మశ్రీ తుమ్మల కోటయ్య గారు
జనని : తేజస్వి శ్రీమతి అన్నపూర్ణమ్మ
బ్రహ్మానందాశ్రమ పీఠాధిపతులు చంద్రాల,
మైలవరం మండలం, కృష్ణాజిల్లా.

వికశించిన పుష్పాలు
కార్తీకమాస వైభవం, శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారి చరిత్ర,
శ్రీ హనుమాన్ అవతార లీలా రహస్యాలు, గో మహిమ,
పెళ్లి అర్థం-పరమార్థం, ఆదిదంపతుల అవతారలీల రహస్యాలు,
శ్రీ వేణుగోపాలస్వామి వారి అవతార లీలారహస్యాలు, శ్రీ షిరిడిసాయి బాబా
తత్వజ్ఞాన రహస్యాలు, రావి-వేప వృక్షముల వివాహ ప్రాశస్త్యము, సద్గురువు
బ్రహ్మశ్రీ తుమ్మల కోటయ్య గారి జీవిత చరిత్ర.

**త్వరలో వికసింపబోవు ప్రసూనాలు**

1. స్వరజ్ఞానము
   ఆరోగ్యానికి, ముక్తికి మార్గము

చిరునామా : **తుమ్మల లక్ష్మయ్య**, గుడ్లవల్లేరు, కృష్ణాజిల్లా.
**ఫోన్: 08674-274311, 9440420985**

గ్రంథ స్వీయకర్త



గోదావరి - కృష్ణా నదుల అనుసంధాన కర్త,
అపర భగీరథుడు, నవ్యాంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రి
**శ్రీశ్రీశ్రీ నారా చంద్రబాబునాయుడు గారికి**
అంకితం....

రచయిత :
**తుమ్మల లక్ష్మయ్య**

# శ్రీ కృష్ణానది పుష్కర మాహాత్మ్యం

రచన :

**తుమ్మల లక్ష్మయ్య**

గుడ్లవల్లేరు, కృష్ణాజిల్లా.

ఫోన్స్ : 08674-274311, 9440420985



ప్రకాశకులు :

**మోహన్ పబ్లికేషన్స్**

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం.



2016

వెల : 30-00

# శ్రీ కృష్ణానది పుష్కర మాహాత్మ్యం



గ్రంథకర్త :
**తుమ్మల లక్ష్మయ్య**
గుడ్లవల్లేరు, కృష్ణాజిల్లా
ఫోన్ : 08674-2743111

ముద్రణ : జనవరి, 2016

ప్రింటింగ్ & పబ్లిషర్స్, ప్రతులకు :
**మోహన్ పబ్లికేషన్స్**
**అజంతా హోటల్ ఎదుట,**
**కోటగుమ్మం, రాజమహేంద్రవరం.**

# శుభాకాంక్షలు



'ఆచార్య'
మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి

"అప ఏవ ససర్జాదౌ" అని వేద వాఙ్మయం చెప్పింది. సృష్టిలో మొట్టమొదట వెలువడింది నీరే. అఖండమైన జలతత్త్వమే భూమికి ఆధారం. మానవుడికి అపవిత్రతను పోగొట్టి పవిత్రతను ప్రసాదించేది నీరు.

అలాంటి నీరు ఒక నదీ రూపాన్ని పొంది సుదూర తీరాలను తాకుతూ ప్రయాణించి, లక్షలాది ప్రజల దాహార్తిని తీరుస్తూ, వేలాది ఎకరాల పంట పండడానికి ఆధారం అవుతూ మానవ జీవితానికి మరింత చేరువ అయింది. సంస్కృత భాషలో "జీవనము" అంటే నీరు అని అర్థం. మనకు జీవనాధారం నీరే కనుక, ఆ అర్థం వచ్చిందేమో అనిపిస్తుంది. అవసరమైతే ఆహారం లేకుండా మానవుడు కొన్నాళ్ళు జీవించగలడు. కానీ, నీరు లేకుండా కొన్ని గంటలైనా జీవించలేడు.

సహ్యాద్రి శ్రేణుల్లో పుట్టిన కృష్ణవేణీ నది ఎంత పవిత్రమైనదో కదా! అందునా, ఆ నదిలో పుష్కరుడు ప్రవేశిస్తే, ఇక చెప్పేదేముంది? 'పుష్కరాలు' అనగానే సకలతీర్థాలూ ఆ నదికి చేరుతాయి. దేవతలు, మహర్షులు, పితృదేవతలు పుష్కరకాలంలో ఆ నదీజలాల్లో కొలువై ఉంటారు. అలాంటి పుష్కరస్నానం, ఆ తరువాత నిర్వహించే విధులు మానవుడికి పుణ్యప్రదమైన స్థితిని ప్రసాదిస్తాయనుకోవడంలో ఆశ్చర్యం ఏమున్నది?

పావన కృష్ణవేణీ నదికి పుష్కరాలు వస్తున్న సందర్భంలో ఆ నది చరిత్ర, పుష్కర ప్రశస్తి, ఆ నదీ తీరాన వెలసిన పుణ్యక్షేత్రాల సమాచారం భక్తులకు అందితే, వారు ఎంతగా ఆనందిస్తారో కదా!

ఆస్తిక లోకానికి విశేష ప్రయోజనం కలిగే చక్కని గ్రంథాన్ని రూపొందించిన **శ్రీ లక్ష్మయ్య గారు,** గ్రంథం వెలుగులోకి రావడానికి బాధ్యత వహిస్తున్న **శ్రీ పుప్పాల అప్పారావుగారు** ధన్యులు. పరమాత్ముని కరుణ వీరిద్దరిపై అపారంగా వర్షించాలని కోరుకుంటూ, ఈ గ్రంథం బహుళ జనాదరణ పొందగలదని ఆకాంక్షిస్తున్నాను.



# మనవి

పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపులగు పాఠకోత్తములారా!

గ్రంథ రచన ఒక అసిదారా వ్రతం. అందునా శ్రీకృష్ణానదీ మహాత్మ్యము, పుష్కర ప్రాశస్త్యము, పుణ్యక్షేత్రముల మహిమలు వ్రాయడం అంటే మరీను. అటువంటి వాటిని గురించి సూత్రీకరణలో ఈ గ్రంథములో గ్రంథకర్త అకుంఠిత దీక్షా దక్షతలు వెల్లడిస్తున్నాయి.

ఇట్టి గ్రంథరచనకు కేవలం భాష మాత్రమే చాలదు. అసమాన్యమైన భక్తిప్రేరణతో కూడిన ఆధ్యాత్మిక తత్వజ్ఞాన విచార సమగ్ర దృష్టి గ్రంథకర్త కలిగిఉండాలి. అవి నిండుగా కలిగియుండుటవలననే శ్రీ తుమ్మల లక్ష్మయ్య గారు ఈ అమూల్యగ్రంథం వ్రాయగలిగారు. చదవడం మొదలు పెడితే సామాన్య విద్య విజ్ఞానం కలిగినవారిని సైతం అంతా చివరి దాకా చదివించగల శక్తి ఈ గ్రంథానికి ఉన్నదనడం ఏ మాత్రమూ అతిశయోక్తికాదు.

వీరి లేఖని నుండి భారతీయ సంస్కృతిని, ధర్మాలను ప్రకాశింప జేయు గ్రంథములు ఇతోధికముగా వెలువడగలవని ఆశిస్తూ వారికి మా అభివందనములు తెలియజేస్తున్నాము. ఈ గ్రంథము ప్రచురించి విశేష ప్రచారం చేసే సదవకాశాన్ని మాకు కలుగజేసిన శ్రీ తుమ్మల లక్ష్మయ్య గారికి మా హృదయపూర్వక ధన్యవాదములు.

–పుప్పాల అప్పారావు

# విజ్ఞాపన

సర్వశాస్త్రసమన్వయ సారమే మన భారతీయ సంస్కృతి మంత్ర ద్రష్టలైన మనమహర్షులు తమ తపశ్శక్తి సంపదలచే మన దేశమునందు గల నదులలో పది రెండు నదులు పవిత్రనదులుగా గుర్తించారు. వాటికిని గురుని రాశిప్రవేశమునకు సంబంధం ఏర్పరిచారు.

గురువు రాశి ప్రవేశము పొందిన కాలమున ఆరాశికి చెందిన జలము విశిష్టత పొంది రంగు, రుచి, వాసనల యందు ప్రత్యేకత సంతరించుకొను చున్నవని గుర్తించారు.

ఆ కాలమే నదీ పుష్కర కాలంగా నిర్ణయించారు. పుష్కర కాలములో ఆయా నదులలో స్నానము చేయు కర్మకాండలు, దానములు పితరులకు ఉత్తమ లోకములు కల్పించునని శాస్త్రప్రమాణము.

నదులన్నింటిలోను శ్రీకృష్ణానది ఎంతో పవిత్రమైనది. అందుకు కారణము సాక్షాత్తు శ్రీకృష్ణ పరమాత్మ శ్రీకృష్ణానదిగా ఆవిర్భవించాడు. శంకరుడు వేణీ నదీగాను, బ్రహ్మకుముద్వతి నదిగాను మిగిలిన దేవతలు విశాల, విజయ వైష్ణవి, మాలాలవాటిణి, కౌశిత, నారాయణి, భీమా, తుంగభద్ర, అర్చిరము, చికుందాది నదులుగా ఏర్పడ్డారు.

ఈ నదుల సమూహమే శ్రీకృష్ణానదీ ఏర్పడినందున కృష్ణ యందు ముక్కోటి దేవతలు త్రిమూర్తులకు సంబంధం కలిగియున్నందున ఎంతో పవిత్రమైనది కృష్ణానది.

ఈ కృష్ణానదీ మహత్మ్యం రచించేందుకు ఎందరో మహాను బావుల గ్రంథాలను సహకారిగా తీసుకున్నాను. వారందరకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. పోయి చూడలేకున్నను పుణ్యతీర్థముల మహిమలు చదివినా విన్నా కూడా దర్శన ఫలం లభిస్తుందని పెద్దలవాక్కు.

నా వ్రాతపతిని అచ్చుకు అనుకూలంగా వ్రాసి ఇచ్చిన మా మనుమ రాలు, తుమ్మల వేణుబాబు, ఎ.ఎ.ఇ., డా. ఎన్.టి.టి.పి.ఎస్. కొండపల్లి గారి కుమార్తె కుమారి లక్ష్మీప్రియదర్శిని, మనుమడు శ్రీ కృష్ణచైతన్యకు నా ఆశీస్సులు.

ఈ గ్రంథం చూచి శుభాకాంక్షలు అక్షర రూపంలో అందించిన ఆచార్య మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తి గారికి నా హృదయపూర్వక నమఃసుమాంజలులు.

మీ ఆత్మీయుడు రచయిత

**–తుమ్మల లక్ష్మయ్య**

## విషయ సూచిక

## విజయవాడ కనకదుర్గా స్తోత్రం



**కౌమారి "భువనేశ్వరీ" శుభకరీ సర్వార్థ సంపత్కరీ**
**పంచకోశ పరీతపూత విజయశ్రీవాటికాధీశ్వరీ**
**రంగన్మంగళ కృష్ణవేణి తటినీ తీరే సదాసంస్థితా**
**దుర్గాంబా నవకోటి మూర్తి సహితా మాంపాతు మహేశ్వరీ.**

## శ్రీకృష్ణనదీ ధ్యానం

అంబత్వద్దర్శనాన్ముక్తిః । సజానేస్నానజం ఫలం
స్వర్గారోహణ సోపానాం । మహాపుణ్యా తరంగిణీం
అధికాం సర్వతీర్థానాం । కృష్ణవేణీం సమామ్యహం ॥

తల్లీ నీ దర్శనంచేతనే ముక్తి కలుగును. స్నానము చేసిన ఫలమెంత కలుగునో తెలియదు. స్వర్గారోహణకు సోపానమై, పుణ్య తరంగములను వీచుచూ, సర్వ తీర్థములలో అధికమైన కృష్ణవేణికి నమస్కరించుచున్నాను.

ఒక్కసారి కృష్ణవేణీ నదీమ తల్లిని స్మరించి పరిశుద్ధ స్నానం చేసిన ఇప్పటి వరకూ చేసిన పాపాలన్నీ పటాపంచలవుతాయని భారతీయుల విశ్వాసం. ఈ విషయంలో మహాభారతంలో–

"జన్మ ప్రభృతి యత్పాపం స్త్రీయావా పురుషేణవా
పుష్కరే స్నాతమాత్రస్య సర్వమేవ ప్రణశ్యతి."

పన్నెండు సంవత్సరాల కొకసారి వచ్చే ఈ పుష్కర పర్వకాలంలో స్నాన, శ్రాద్ధ, దాన విధుల్ని పాటిస్తే పితృదేవతలకు ఉత్తమ లోకాలు ప్రాప్తిస్తాయి. దేశం సస్యశ్యామలమై సుభిక్షంగా వంశాభివృద్ధితో మానవజాతి శాంతి సౌఖ్యాలతో కళకళలాడుతుంది.

# శ్రీ కృష్ణానదీ మహత్మ్యము



ఒకప్పుడు నైమిశారణ్యంబున మునులందరు సూతునిం గాంచి "మహాను భావా! ప్రపంచంబున మీరెరుంగని పురాణం బెద్దియు లేదు. నేడు శ్రీకృష్ణానదీ వృత్తాంత మామూలాగ్రముగ తెలుపుండని" ప్రార్థింప నమ్మహర్షియు సంతసించి స్కాంధపురాణ ములోని సహ్యాద్రి ఖండమందలి శ్రీకృష్ణానది మహాత్మ్యంబును వారి కిటు లెరింగించెను.

"మునిపుంగవులారా! భరతభూమి పయి వాయువ్యోత్తర దిశలందు సహ్యాపర్వతము కలదు. అందు బ్రహ్మగిరి, వేదగిరులను నామంబుల రెండు శిఖరములు గలవు. అచట శ్వేతాశ్వత్థ వృక్షమయి నిలచిన శ్రీకృష్ణుని పాదముల నుండి ఉత్పన్నంబయిన శివస్వరూపి కృష్ణవేణి మహాత్మ్యంబును వర్ణింప నెంతటి వారికేనియు శక్యము కానిదయియున్నను పద్మపురాణోత్తర ఖండమున వివరించినట్లు నా యోపినకొలది మీకు తెలుపుచున్నాడను.

చాక్షుస మన్వంతరంబున బ్రహ్మదేవుడు సకల దేవ మునుల సమక్షము నందొక దివ్య యజ్ఞము చేయుచుండ విధాత పెద్ద భార్య అయిన సరస్వతి నిర్ణీత కాలమున యజ్ఞవాటికను చేరలేకపోయెను. ఆ కారణంబున వాని రెండవ భార్యయైన గాయత్రి నా స్థానమున నలంకరింపజేసి పెద్దలు క్రతువు నారంభించిరి. అంతలో సరస్వతి వచ్చి యందున్న వారిపై కోపించి "మీరం దరూ నదీనదములయిపొం" దని శపించినందున వారిలో శ్రీకృష్ణుడు కృష్ణానదిగను, శంకరుడు వేణీనదిగను, భూమిపై ప్రవహించి యేకంబగుటచే కృష్ణవేణియను నామంబు కలిగెను. మిగిలిన దేవతలలో బ్రహ్మ కుముద్వతి గను, మిగిలిన దేవతలు విశాల విజయ, వైష్ణవి, మలాపహరణి, కైశికి, నారాయణీ, భీమా, తుంగభద్ర, అర్చిర, ముచికుందాది నదులుగా ఏర్పడినవి.

ఈ నదుల సమూహమే కృష్ణానదిగా నుండుటచే కృష్ణయందు ముక్కోటి దేవతలు, త్రిమూర్తుల సంబంధము వలన కృష్ణపై త్రిశక్తులు కలిగియున్నవనుచున్నారు.

## వైజ్ఞానికంగా

వైజ్ఞానికంగా యీ నదులకు ఎంతో ప్రాశస్త్యం వుంది. ఎక్కడో ఆవిర్భవించి, అనేక వందలమైళ్ళు అడవుల్లో, పర్వతాగ్రాలమీద, మైదానాల్లో ప్రవహిస్తూ, అనేక వనమూలికలను, ఖనిజములను తనలో ఐక్యం చేసుకుంటూ ప్రవహించే యీ నదులలో ఒక్కసారైనా మునిగి తేలితే రసాయన ఓషధీమహత్యం వల్ల శారీరక రుగ్మతలు నశిస్తాయి. స్వచ్ఛమైన అదే జలాలలో స్నానం చేస్తే శారీరకంగానే కాకుండా మానసికంగా కూడా అనేక వ్యాధులు నిర్మూలనం అవుతాయి. కొనవూపిరితో వున్న మానవుని నోటిలో గంగాజలం పోయటం మీరందరూ ఎరిగిన విషయమే.

## కృష్ణ సహ్యా పర్వతములలోనే పుట్టుటకు పురాణపరంగా కారణం

ద్వాపర యుగాంతమున సురమునీంద్రులు కైలాసంబునకు పోయి శంకరుని ప్రసన్నుని చేసికొని "దేవా రానున్న కలియుగము పాప భూయిష్టం బయినది గద. అందు మానవులు తరించుట కేదేని యొక నుపాయంబు ఎరిగింపుడని" ప్రార్థించిరి. అంత పరమేశ్వరుడు కరుణా తరంగుడయి వారలతో "నేను కలియుగంబున కృష్ణానదినయి ప్రవహించెదను. ఆ సమయంబున నన్ను స్మరించినవారు, స్పృశించిన వారు, నాయందు స్నానములు చేసినవారు, పితృకర్మాది పిండ ప్రదానములు చేసిన వారందరు సమస్త పాపముల నుండి విడువబడి కైవల్యము నందెద" రని వారి కెరింగించెను.

గత ప్రళయానంతరమున బ్రహ్మదేవుడు తిరిగి సృష్టి క్రమంబున కుపక్రమించి శ్రీమన్నారాయణునితో కలియుగంబున ధర్మము నిలుచున దెట్లని యడిగెను.

నారాయణు డందులకు సంతసించి తన రూపంబున కృష్ణ నేర్పడ జేసెను. బ్రహ్మ, దేవేంద్రాదులు వెంటనుండ యా కృష్ణను పుడమికి గొని వచ్చి దానిని నిలుపదగిన ప్రదేశము కొరకు నన్వేషించుచు ఒకచోట నిశ్చల తతో దీక్ష వహించియున్న సహ్యామునిని గాంచి "మునీంద్రా! కొండ వలె నిశ్చలతతో చలనరహితుడవయి నీవు గావించుచున్న తపంబున కానందిం

చితిని. విష్ణు స్వరూపిణి అయిన కృష్ణను పాపులను బునీతులజేయుట కయి నావెంట గొనివచ్చినాడను. కాన నీవు కోరదగిన దేదియో కోరుకొ” మ్మనియెను.అంత నా సహ్యముని వినయంగా “దేవదేవా! కైవల్యమును కాంక్షించి తపం బొనరించిన నా కన్యసంపద లక్కరలేదు. హరి స్వరూపం బగు నా కృష్ణ నాయందే నిలచి ప్రవహించిన యెడల నేను కృతార్థుండ నయ్యెదను. నాకీ వరము ప్రసాదింపుడు” అనెను.

‘అది విని కృష్ణయు ముని సంకల్పంబు ఈడేర్ప ననుగ్రహించెను.

అంత సహ్యముని శ్రీకృష్ణుని (నారాయణుడు) ఆనతిపయి పర్వత రూపమును ధరించెను. ఆ పర్వతముపై శ్రీకృష్ణుండు శ్వేతాశ్వత్థమయి నిలిచె. ఆ వృక్షాంతర్భాగము నుండి కృష్ణ జననంబయి ధవళ వర్ణముతో రాతిపై పయనింపవెడలెను.

కృష్ణానది ఉత్పత్తి స్థానము నుండి సంగమ ప్రదేశము వరకు గల నదీ లక్షణములు గమనించినచో స్త్రీ వేణీ రూపములోనున్న కారణము దానిని కృష్ణవేణి యని వర్ణించియున్నారనియు, ఈ నదికి ప్రథమమున కలియు నది వేణి అగుట వలను కృష్ణవేణి అనుచున్నారనియు కొందరి అభిప్రాయము యున్నది. కృష్ణను వేణీనది కలిపిన తర్వాత కుముద్వతి నది కృష్ణవేణి యందు కలియుచున్నది. ఈ కృష్ణవేణి కుముద్వతుల మధ్య మహాబలేశ్వరము కలదు. కుముద్వతి తరువాత ఈ నదియందు విశాల, విజయ, వైష్ణవి నదులు కలియుచున్నవి. కుముద్వతి తరువాత కౌశిని, తరువాత నారాయణి కలియుచున్నవి. కృష్ణవేణీ పరివాహక ప్రదేశము ఇంతవరకు స్త్రీ కేశ సంపద కలిగిన శిరస్సుతో పోల్చవచ్చును. కృష్ణవేణీ భీమానది కలియు ప్రదేశము స్త్రీ వేణిని ధరించిన పుష్పమాల ప్రారంభ మనవచ్చును. ఈ మాల భీమానది తర్వాత తుంగభద్ర కలియుటతో పూర్తి అగుచున్నది అనవచ్చును. తరువాత ఈ నదియందు కృష్ణావతార మందలి శ్రీకృష్ణుని మిత్రుడయిన ముచికుందుని పేరుగల మూసీనది ఈ వేణియందు కలియు ఆఖరి నదిగా నున్నది. ఆ ముచికుందుడు ఆ వేణియందు స్త్రీ ధరించిన నాగమణి అనవచ్చును. అచట నుండి ఈ వేణి నిరాఘాటముగా సాగిపోయి పెద పులిగడ్డ ప్రాంతములో రెండు పాయలయినది. అందొక పాయ హంసల దీవి వద్ద సాగరుని చేరగా రెండవ పాయ కొంత విస్తరణచెంది పంచ పాయలయి మోరుతోటవద్ద సాగరుని చేరుచున్నవి.

కృష్ణవేణి పరివాహక ప్రదేశమునందు పలు తీర్థములు కలవు. వీనిలో ముని తీర్థమునందు కృష్ణవేణి రెండు పాయలుగ చీలి ప్రవహించు చున్నది. ఇచట మథరాపురము కలదు. తిరిగి కృష్ణవేణి దేవహ్రదంబు అను క్షేత్రము నందు కలియుచున్నది. మాలాపహరిణియు కృష్ణనదియు కలియు స్థలమును మలాపహారి సంగమక్షేత్ర మందురు. ఇచ్చట ఉదకము పచ్చని నంగుతో నుండును. పరశురాముడు ఇచ్చటనే క్షాత్రవధ పాపమును తొలగించుకొనె నని చెప్పుచున్నారు. జాతిస్మర తీర్థమునందు కృష్ణ తిరిగి రెండు పాయలై ప్రవహించుచున్నది. తుంగభద్రా సంగమ క్షేత్రమును అలంపురి అందురు. ఇచ్చట నవబ్రహ్మేశ్వర లింగములు కలవు.

# పుష్కర ప్రాశస్త్యము

మన సనాతన సంప్రదాయంలో ఒక విశిష్ఠమైన ఘట్టం... పుష్కరాలు.

నదుల జలభిక్షతో సుభిక్షంగా జీవిస్తున్న మనం ఆ నదీమతల్లులను ఆరాధించే మహదవకాశాన్ని ఈ పుష్కరాలు కలిగిస్తాయి. గంగ, యమున, సరస్వతి, నర్మద, గోదావరి, కృష్ణ, కావేరి, భీమనథి, బ్రహ్మపుత్ర, తుంగభద్ర, సింధు, ప్రణీత అనే పన్నెండు జీవనదులు పుష్కర ప్రవేశం గల తీర్థాలు.

కాగా నదులయొక్క ఈ పుష్కరోత్సవం బృహస్పతి గమనంతో ముడి పడివుంది. మన ఖగోళం మేషం, వృషభం మొదలైన పన్నెండు రాశులుగా విభజించబడింది. గ్రహాలన్నీ వివిధ అవధులలో ఈ రాశుల చుట్టూ తిరిగి వస్తుంటాయి.

సూర్యుడు నెలకొకసారి ఒక రాశి నుండి మరొకరాశిలోకి ప్రయాణిస్తూ, మొత్తంరాశి చక్రాన్ని పన్నెండు నెలల్లో పూర్తి చేస్తాడు. అట్లే తక్కిన గ్రహాలన్నీ ఆయా కాల పరిధులలో రాశిచక్రం చుట్టూ తమ పయనాన్ని సాగిస్తాయి. అయితే బృహస్పతికి ఈరాశి చక్రం చుట్టూ తిరిగేందుకు పట్టే సమయం పన్నెండేళ్ళు. మొత్తం పన్నెండు సంవత్సరాలలో రాశిచక్రాన్ని చుట్టి వస్తాడు బృహస్పతి. ఈ విధంగా బృహస్పతి ఒక్కోరాశిలోకి ప్రవేశించి నప్పుడు ఒక్కోనదికి పుష్కరాలు వస్తాయి. అంటే బృహస్పతి అడుగిడిన రాశికి సన్నిహిత ప్రాంతంలో వుండే జీవనదికి ఆ సంవత్సరంలో పుష్కరాలు వుంటాయి. ప్రస్తుతం బృహస్పతి కన్యారాశిలోకి ప్రవేశిస్తున్న కారణంగా, కృష్ణానదికి పుష్కరాలు రానున్నాయి.

పుష్కరాల సమయంలో సౌరకుటుంబంలోని గ్రహకూటమికి చెందిన శుభకిరణాలు ఆ పుష్కర నదిపై ప్రసరిస్తాయి.

అంతేకాదు. పుష్కరసమయంలో ఆనదీజలం దేవతలయొక్క తేజస్సును పొంది వుంటుంది. అందుకే ఆ సమయంలో స్నానం, ధ్యానం, దానం, జపం, అర్చన, హోమం, తర్పణం మొదలైన అనుష్ఠానాలు, పితృదేవతలకు పిండప్రదానాలను చేయమని మన మహర్షులు మనకు ప్రబోధించారు. కాగా, నీటికి పుష్కరం అనే పేరు కూడా వుంది. "పోషయతీతి పుష్కరమ్" అని చెప్పబడింది అంటే జీవజాలాన్ని పోషించేది" అని అర్థం. నీటికి మురికిని పోగొట్టి శుభ్రపరచడం, దాహాన్ని తీర్చడం లాంటి భౌతిక శక్తితోపాటు, దేవతాశక్తి కూడా వుందని వేదం అంటోంది. మేధ్యం, యజ్ఞం అని ఆ దేవతాశక్తి రెండు రకాలు. వీటిలో 'మేధ్యం' అనే శక్తి పుణ్యస్నానం, ఆచమనం మొదలైన వాటి ద్వారా మన పాపాలను తొలగింపజేస్తుంది. ఇక యజ్ఞం అనేది ప్రోక్షణం, నీళ్ళు జల్లడం లాంటి క్రియల ద్వారా వస్తువులను పవిత్రం చేస్తుంది.

పుష్కరాలలో నదీ జలాలు మరింత దేవతాశక్తిని పొంది మనలను పవిత్రులుగా జేస్తాయి. ఇక పుష్కర సమయంలో వివిధ ప్రాంతాలలోని జనులంతా ఒక చోటికి చేరి నదీ స్నానాలను ఆచరిస్తారు. దాన ధర్మాల ద్వారా ఒకరికొకరు చేరువ అవుతారు. అందుకే ఈ పుష్కరాలు భిన్నత్వంలో ఏకత్వం అని చాటి చెప్పే మన ఔన్నత్యానికి, మన సాంఘిక జీవన తత్వానికి, మన సమైక్యతకు ప్రతీకగా నిలుస్తున్నాయి.

అదేవిధంగా జల ప్రాధాన్యాన్ని గుర్తించాలనే సామాజిక బాధ్యతను కూడా ఈ పుష్కరాలు మనకు గుర్తుకుతెస్తాయి.అందుకే పెరుగుతున్న జనసంఖ్య కారణంగా నీటిసంక్షోభం విశ్వరూపం ధరిస్తున్న ప్రస్తుత తరుణంలో జల వనరులను అపురూపంగా చూడాలి. నీటి వృధాని అరికట్టి, నీటిని ఎంతో జాగ్రత్తగా వినియోగించు కోవాలి. నదుల పవిత్రతను గుర్తించాలి. అవి కాలుష్యం బారిన పడకుండా కాపాడుకోవాలి.

## పుష్కరం మహాపర్వం. అనగా గొప్ప పుణ్యసమయం

ఈ సమయంలో భూమండలంలోని సమస్త తీర్థాలేగాక ఇతర లోకాల్లోని పవిత్ర తీర్థాలన్నీ పుష్కరనదిలో చోటు చేసుకుంటాయి. ఈ పవిత్ర సమయంలో త్రిమూర్తులు, ఇంద్రాది దేవతలు, సమస్త ఋషులు,

పితృదేవతలు, పర్వకాలం దాటేంతవరకు, పుష్కరస్థానంలో నివాసాలు ఏర్పరచుకొంటారు. అందుకే స్నానము, దానము, పూజ, పితృతర్పణాలు, శ్రాద్ధకర్మలు, ఈ పుష్కరాల్లో చేయడం. దీనిచేత మానవుల పుణ్యాన్ని కోటిరెట్లు పెంచుకుంటారు. పుష్కర సమయాల్లో దేవతలు, ఋషులు, వారితో పాటు పితరులు కూడా వస్తారన్న ప్రమాణ వాక్యమున్నది. కనుక స్నానదానముతో పాటు పితృకర్మలు కూడ చేయాలన్నదే సంగ్రహమైన సమాధానం. ఇవి చేయడం చేత విధిని అనుష్ఠించిన తృప్తి మనకు, తమ భాగాలనందుకొన్న తృప్తి వారికి, తద్వారా పరస్పర సహకార భావములు కల్గడమే ప్రయోజనం. కాగా మరొక విషయమిక్కడ మనం తెలుసుకోవలసినదున్నది. ఇక్కడ చేసే శ్రాద్ధం వారికి అక్కడ తిండి పెడుతుందా?

ఢిల్లీ రేడియో స్టేషనులో మాట్లాడే మాటలు, పాడే పాటలు మన యింట్లో ఇక్కడ వింటున్నాం. అంటే వాయుతరంగాలలో మనకంటికి కనబడని శబ్దగ్రాహకములైన కొన్ని అణువులు అక్కడి శబ్దాలను మోసుకొని మనకిక్కడికి తెచ్చి వినిపిస్తున్నాయన్నమాట. ఇదే విధంగా మనకంటికి కనబడని కొన్ని పదార్థగ్రాహకములైన అణువులు ఇక్కడ సమంత్రకంగా పెట్టే శ్రాద్ధ ద్రవ్యంలోని ఆహారసారాన్ని మన పితరులకు అందివ్వవచ్చును గదా! ఇంత లేనిది జ్ఞానధనులైన మన పెద్దలు మనకీ సంప్రదాయాన్ని ఎందుకు అందిస్తారు? దాని పై విశ్వాసం కొద్దీ అది పనిచేస్తుంది.

“ఆపస్స్వభావతో మేధ్యాః” అని జలము స్వతః పవిత్రమైనను, కొన్ని సమయాల్లో కొన్ని చోట్ల పారేనీళ్ళు పవిత్ర నదీసారాలను తమ గర్భము నందుంచుకొని పారుచుండును. దేశకాల ప్రభావితమైన ఆ స్థలంలో తత్ప్రయుక్తములైన కార్యాలు చేయాలి. అది అనంతమైన పుణ్యాన్ని ఇచ్చేదేకాక ఇహపరములను కూడ సాధించి పెడుతుందని ఋషుల సూక్తి.

## పుష్కరుని చరిత్రము

పూర్వకాలమున తుందిలుడను నొక బ్రాహ్మణుండు కలడు. అతడు బహుకాలము నిష్ఠతో శివునిగూర్చి ఘోరతపము గావించెను. శివుడు తుందిలుని తపమునకు మెచ్చి అతనిని అనుగ్రహించెను. శివానుగ్రహము వలన తుండిలుడు శివాష్టమూర్తులలో నొకటి అయిన జలస్వరూపము దాల్చి హరునియందే లీనమయి యుండెను. ఆ తుందిలునకే పుష్కరుడను నామంబు కలిగెను.

ఒకప్పుడు త్రిలోక సంచారి అయిన నారదుడు తన తండ్రియగు బ్రహ్మ చెంతకుబోయి వినయముగా చేతులు జోడించి "తండ్రీ! కలియుగం బున సమస్త దోషములను హరింపజేసి యిహపరంబుల ప్రసాదింపగల శక్తి కృష్ణానదీ పుష్కరమున కెట్లు వచ్చినది? మూడు లక్షల యేబదివేల తీర్థము లెట్లేర్పడినవో వివరంగా దెలుపు" డని అడుగ నా బ్రహ్మ తన తనయున కీవిధముగా చెప్పెను.

"కుమారా! బృహస్పతి కన్యారాశిలో ప్రవేశించిన కాలమునకే కృష్ణా పుష్కరకాలమని పేరు. తుందిలుడను బ్రాహ్మణుడు శివానుగ్రహము వలన పుష్కరుడను నామమును బొంది జలస్వరూపము దాల్చి శివునియందే లీనమయియుండెను. నేను జగత్సృష్టికి అనుజ్ఞ పొందుటకు సామవేదమున పరమేశ్వరుని కీర్తించితిని. అందుల కాతడు సంతుష్టుండయి తనయందు లీనమయియున్న పుష్కరుని నా కొసగెను. నే నా పుష్కరుని నా కమండలమున నుంచుకొంటిని.

తరువాత కొంత కాలానికి బృహస్పతి నన్ను గురించి ఘోర తపమాచ రించెను. నే నాతని తపమునకు మెచ్చి నీకేమి కావలెనని యడుగ నాతడు తనకు సర్వజ్ఞతయు, గ్రహాధిపత్యమును, నా కమండలములోని పుష్కరుడును కావలయునని కోరగా నే నంగీకరించితిని.

నాకమండలంలోని పుష్కరుడు నాతో ఈ విధముగా పలికెను" "దేవా! నీవు నావెంట వచ్చిన నే నాసురగురుని యధీనమున నుందు" నని పలికెను. అంతట నేను అతనితో 'పుష్కరా! బృహస్పతి మేషము మొదలయిన రాశు లలో ప్రవేశించినపుడు ఆయా రాశులకు చెందిన జీవనదుల తీర్థముల యందు ఆరంభమున పండ్రెండు దినములు చివరిలో పండ్రెండు దినములం దును, మిగిలిన పదునొకండు నెలలోని మధ్యాహ్న కాలములలో రెండు ముహూర్తముల కాలంబులందును వీనితో గూడియుండుము. అపుడు నేను సమస్త దేవతలతో మీరున్నచోటులందే ఉందును" అని చెప్పితిని. అందుకు పుష్కరుండు అంగీకరించి తాను బృహస్పతి వద్దకు బోయెను. ఆనాటి నుండి బృహస్పతి (గురువు) పండ్రెండు నదులలో పండ్రెండు వత్సరము లందు ప్రవేశించుచుండెను. నాయనా నారదా! బృహస్పతి సర్వదేవతా గణయుతుండయిన పుష్కరునితో గూడ మేషరాశియందు ప్రవేశించినపుడు

గంగానదీ పుష్కరము, వృషభరాశియందు ప్రవేశించినపుడు నర్మదా (రేవ) నదీ పుష్కరము, మిధునరాశియందు ప్రవేశించినపుడు సరస్వతీ నదీ పుష్కరము కర్కాటక రాశియందు ప్రవేశించినపుడు యమునానదీ పుష్కరము, సింహరాశియందు ప్రవేశించినపుడు గోదావరీ పుష్కరము, కన్యారాశియందు ప్రవేశించినపుడు కృష్ణా పుష్కరము, తులారాశియందు కావేరినది పుష్కరము, వృశ్చికరాశియందు ప్రవేశించినపుడు తామ్రపర్ణీనది పుష్కరము, ధనూరాశియందు ప్రవేశించినపుడు సింధునదీ పుష్కరము, మకరరాశి యందు ప్రవేశించినపుడు తుంగభద్రానది పుష్కరము, కుంభరాశియందు మలాపహారిణీ (భీమా)నది పుష్కరము, మీనరాశియందు ప్రవేశించినపుడు ప్రణీతానది పుష్కరము జరుగుచున్నవి" అనెను.

## కృష్ణాతీర తీర్థములు – క్షేత్రములు

కృష్ణానది పశ్చిమ కనుమల్లో పుట్టి తూర్పుగా ప్రవహించి పులిగడ్డ వద్ద రెండు పాయలయి ఒకటి మోరుతోట వద్ద రెండవ పాయ హంసలదీవి వద్ద సముద్రంలో కలుస్తోంది. ఈ నది తెలంగాణ రాష్ట్రంలో మహబూబ్ నగర్ జిల్లా అలంపురం వద్ద అడుగిడుతోంది. ఇచ్చటనే తుంగభద్రానది కృష్ణానదితో సంగమిస్తోంది. ఇచ్చట నవబ్రహ్మేశ్వర లింగములుఉన్నవి.

ఈ కృష్ణానది తీరములో పురాణ ప్రసిద్ధములయిన తీర్థములు ఎన్నియో గలవు. కృష్ణవేణీ సంగమ ప్రాంతమున పరమ పవిత్రములలో ఇహపరంబుల నిచ్చునట్టి విష్ణుతీర్థము, రుద్రతీర్థము, బ్రహ్మతీర్థము లున్నవి. తరువాత కుద్మినీ తీర్థమున్నది దానివెంటనున్న విహంగ తీర్థమున తపమొనరించి గరుడుడు అమృతము తెచ్చెనందురు. పిమ్మట భైరవుడు పుట్టిన భైరవతీర్థమున్నది. దాని తరువాత నాగేశ్వరుడు లింగరూపముల వెలసిన వాసుకీతీర్థము ప్రసిద్ధమయినవి. ఈ జలములందు నల్లని నువ్వులు ఉంచిన అవి తెల్లవగునట. పిదప అఘహరి నదీ సంగమము, సప్తసాగర తీర్థము, కౌశికసంగమతీర్థము, భారత తీర్థము, శూర్పారక తీర్థము, వాల్మీకి తీర్థము, సిద్ధహ్రద తీర్థము లున్నవి. తదుపరి గోపాద తీర్థము, అనంత తీర్థము, సూర్యతీర్థము, శుక్ల తీర్థము సప్తకోటి తీర్థంబులును పురాణ ప్రసిద్ధములు.

ఇక కృష్ణానదీతీరముననను దాని పరివాహక ప్రాంతమునందును నేడు ప్రసిద్ధమయియున్న పుణ్యక్షేత్రములను గురించి క్లుప్తముగా తెలియ పరచెదను.

**1. శ్రీశైలం :** ఇది కర్నూలు జిల్లాలోనున్న సుప్రసిద్ధ పుణ్యక్షేత్రం.

సహ్యాపర్వతం నుండి ప్రయాణమై పయనించుచున్న కృష్ణవేణి శ్రీశైలము వరకు వచ్చి ప్రమథగణ పరివేష్టితుడయి శంకరుడు నివశించిన శ్రీశైలము వద్ద నిలచియుండ, దేవతలు పర్వతరాజును వేడికొనగ శ్రీశైల నగరాజు పుణ్యవతియైన కృష్ణకు దారినీయ, నది మూడుభాగములుగచీలెను. కృష్ణవేణియు దివ్యుల ప్రార్థన లాలకించి పాతాళము వరకు భూమిని ఛేదించు కుని శ్రీశైలము మధ్యభాగమునుండి మార్గమేర్పరచుకొని ముందుకు సాగి పోయినపుడు భూమిని జొచ్చుకొనిపోయిన చోటుకే పాతాళ గంగయని పేరు.

ఒకప్పుడు సూర్యభగవానుడును, యింకొకప్పుడు పార్వతీదేవియు కృష్ణవేణిని దర్శింపరాగా కృష్ణ "మీరంతా యిందే నిలువుడని" చెప్పగా వారా పాతాళ గంగయందె స్థిరముగ నుండెనని పెద్దలు చెప్పుచుండిరి.

శ్రీశైలమందు ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకటైన భ్రమ రాంబికా సమేత మల్లిఖార్జునస్వామి యట భక్తుల పాలించు చున్నాడు. అందు అనేక తీర్థంబులు గలవు. కృష్ణకు మార్గమిచ్చుటకు చీలిన శృంగ త్రయంబు నకు బ్రహ్మగిరి, విష్ణుగిరి, రుద్రగిరి అను నామంబు లేర్పడినవి "శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నలభ్యతే" అంటారు పెద్దలు.

**2. నాగార్జున సాగర్ :**

కృష్ణానది పరివాహక ప్రదేశము ప్రాచీన కాలము నుండియు విదేశములందు కూడా ఖ్యాతి వహించి యున్నది. నాగార్జునకొండ గుంటూరు జిల్లా మాచెర్లకు 14 మైళ్ళ దూరములో నున్నది. ఈ ప్రాంతమునందు ప్రభుత్వము పెద్ద ఆనకట్ట నిర్మించినది. దీనిని మన ప్రథమ భారత ప్రధాని శాంతిదూత, స్వర్గీయ జవహర్‌లాల్ నెహ్రూ 'ఆధునిక దేవాలయం' అన్నారు.

అది నిజమే. ఎందుకంటే దేవాలయంలో పూజలు కావిస్తే ముక్తి లభిస్తుంది. ఈ ఆధునిక దేవాలయం నుండి కాలువలు త్రవ్వుకుంటే భుక్తి లభిస్తుంది. దేవాలయంలో పూజలు చేస్తే అజ్ఞానమనే చీకటి తొలగు తుంది.

ఈ ఆధునిక దేవాలయం చెంత నిర్మించిన జలవిద్యుత్ కేంద్రం చీకట్లను పారద్రోలుతుంది. ఇది కృష్ణానదిపై నిర్మించిన అత్యద్భుత కట్టడము. మానవ మేధస్సుకు గీటురాయి. రెండు కొండలను సిమెంటు కొండతో కలిపినట్లుంటుంది. (కాంక్రీట్) ఈ నాగార్జునసాగర్ ప్రాజెక్టు ప్రపంచములో పెద్ద ప్రాజెక్టులలో నాల్గవది. దీని ఎత్తు 570 అడుగులు. ఇందులకు 144 కోట్లరూపాయలు ఖర్చు అయినవి. దీని నుండి కుడి ఎడమ కాలువలు త్రవ్వినారు. కుడి కాలువ 4150 అడుగులు పర్వత సొరంగము గుండా ప్రవహించుటకు కృషి సలిపిన మన నేటి శాస్త్రజ్ఞుల విశేష ప్రతిభను అలనాటి మయుడు సయితము పొగడక తప్పదు. ఈ సొరంగము నాగార్జున సాగర్‌కు 2 మైళ్ళ దూరమున కలదు. ఈ ప్రాజెక్టు వలన 8.3 లక్షల హెక్టార్ల భూమికి సాగునీటి సరఫరా జరుగు చున్నది. 75,000 కిలోవాట్ల విద్యుత్ లభించుచున్నది.

దీనికి పేరు వచ్చుటకు కారకుడు నాగార్జునుడు ఇతడు ఆంధ్రుడు. క్షత్రియుడు. 2 వ శతాబ్దమునకు చెందినవాడు. ఈ ప్రాంతము నందు పెద్ద పట్టణము నిర్మించియున్నాడు. ఈ ప్రాంతమున పెద్ద విశ్వవిద్యాలయము ఉండెడిది. గ్రీసు, చైనా, టిబెట్, బెంగాలీ కందహారు ప్రాంతముల నుండి వచ్చి విద్యార్థులు విద్యనభ్యసించెడివారు. నాగార్జునుడు రసవాదములో దిట్ట. ఇతడు బౌద్ధమతమును స్వీకరించెను. నాగార్జునసాగర్ నిర్మాణమునందు లభించిన బౌద్ధవిగ్రహములు. స్థూప అవశేషాలు మ్యూజియంలో భద్రపరచారు. ప్రతివారూ చూడదగిన ప్రాంతమిది. ఇది గుంటూరు జిల్లాలో ఉన్నది.



## 3. అమరావతి

ఈ అమరావతి బౌద్ధమతమును వ్యాప్తి గాంచిన స్థలముగా విదేశముల యందు ఖ్యాతి గాంచి యున్నది. ఇచ్చటగల క్రౌంచ పర్వతముపై కపిలాది మునులు తపము గావించి యున్నారు. ఇది పంచ ఆరాములలో మొదటిది. 1. అమరారామము, 2. కొమరారామము, 3. భీమారామము, 4. ద్రాక్షారామము, 5. క్షీరారామము.

అమరావతియందు, మరణము వారణాసియందు మరణ మునకు సమానముగా నెంతురు. దీనిని నేడు దక్షిణకాశి యనుచున్నారు. ఈ అమరావతి 6వ శతాబ్దమున ఆంధ్ర రాజులకు ముఖ్యపట్టణముగా నున్నది. అపుడీ పట్టణము 12 మైళ్ళ విస్తీర్ణము కలిగి 30 లక్షల జనాభాతో ఉండి యుండెడిది అనుచున్నారు. శాతవాహనులు, ఆంధ్రులు వైదిక మతస్థులయినను వీరు బౌద్ధుల నాదరించి యున్నారు. అనాది నుండి మనం పరమత సహనం గలవారమనుటకు యిది చక్కని నిదర్శనం. బౌద్ధులు అమరావతిలో 'దీపాల దిన్నె' అను స్థలమునందు విహారము స్థాపించి శిల్పాది కళలకు దోహదము చేసియున్నారు. ఆనాటి శిల్పకళా నైపుణ్యమును నేడు బ్రిటీష్‌వారి లండన్ నగరమందు, కలకత్తా, మదరాసు పురావస్తు శాలల యందును చూడ వచ్చును.

అమరావతిలోని దేవుని పేరు అమరేశ్వరుడు. ఈ అమరేశ్వర లింగం 15 అడుగుల ఎత్తు ఉంటుంది. దీనిని గూర్చి ఒక కథ ప్రచారంలో ఉంది. అమరేశ్వర లింగం రోజు రోజుకు ఎత్తు ఎదుగ సాగిందట. ఆ పెరుగుదల ఆపడానికి లింగం నెత్తిన మేకు కొట్టారట. అక్కడితో లింగం ఎదుగుదల ఆగిందంటారు. లింగంమీద మేకు కొట్టిన గుర్తు, లింగంమీద నెత్తుటి చారలు చూపుతారు. స్వామికి అభిషేకం చేయాలంటే మెట్టెక్కి వెళ్ళి చేయాల్సి ఉంటుంది. స్థలపురాణం ప్రకారం యీ లింగాన్ని దేవేంద్రుడు స్వయంగా ప్రతిష్ఠించి తన అహల్యా జారత్వం దోషాన్ని పోగొట్టుకున్నాడని కథ. అందు వల్ల యిది అమరావతిగా పిలువబడిందంటారు.

క్రీస్తుపూర్వము ధాన్యకటకము లేక ధరణికోటను రాజధానిగా చేసికొని గౌతమీపుత్రశాతర్ణి పాలించెను. ధరణికోట అమరావతికి 1 మైలు దూరములో నుండుటచేత అమరాతి ధరణికోటయు అత్యంత సన్నిహిత ప్రదేశ చరిత్ర కలిగియున్నవి. ధాన్యకటకము విశ్వవిద్యా లయము రాజుకీ యాది విద్యలకు నిలయమై యుండెడిది. ఈ విద్యాలయము నందు 2,000 మంది అధ్యాపకులు 60వేలమంది విద్యార్థులకు విద్యగరపుతూఉండెడివారు.



# అమరావతి అజరామర ఖ్యాతి

అమరావతి.... పేరులోనే చిరాయువును నింపుకొన్న ప్రాంతం. అందుకేనేమో చరిత్ర పుటల్లో సుస్థిర స్థానం సంపాదించుకుంది. బౌద్ధ చైత్యాలు నిండిన ఈ ప్రాచీనాంధ్రుల రాజధాని ఇప్పుడు నవ్యాంధ్రకు సచేతన రాజధానిగా కొత్త అవతారమెత్తుతోంది. భవిష్యత్‌లోనూ చరిత్ర సృష్టించేందుకు సిద్ధమవుతోంది. ప్రపంచ శ్రేణి నగరంగా, ప్రపంచానికే తలమానికంగా నిలిచేందుకు తయారవుతోంది. శాతవాహనుల కాలంలో వ్యవసాయ, వాణిజ్య, సాంస్కృతిక ముఖ్య పట్టణంగా విలసిల్లిన అమరావతి మళ్లీ అజరామర ఖ్యాతినార్జించేందుకు పునాదులేసుకుంటోంది.

శాతవాహనుల పాలనకు ప్రధాన కేంద్రంగా ఉన్న అమరావతి అనంతరమూ వివిధ రాజవంశాల పాలనలో సహస్ర కాలం రాజధానిగా విలసిల్లింది. ధనధాన్యాలకు కొదవలేకుండా ధాన్యకటకంగా వర్ధిల్లింది. శాతవాహనుల పాలనలో బౌద్ధం పరిఢవిల్లిన ఈ నేల మహాయానానికి మార్గదర్శిగా నిలిచింది. అదేసమయంలో హిందూ, జైన మతాలకూ జీవ గడ్డగా ఉంది. అమరావతిలోని అమరేశ్వర ఆలయం, పార్శ్వనాథ తీర్థంకరుని విగ్రహాలే దీనికి నిదర్శనాలు. అంతేకాదు విశ్వవిఖ్యాత నలంద, తక్షశిల విశ్వవిద్యాలయాలకు దీటుగా ఇక్కడ ధాన్యకటక విశ్వ విద్యాలయం వేలమం దికి జ్ఞానభిక్ష పెట్టింది. విద్యాపీఠంగా, ఆధ్యాత్మికతకు, కళల కేంద్రంగా ఆలవాలంగా వినుతికెక్కింది.

## ఆది రాజధానే ఆధునిక రాజధాని...

శాతవాహనులు క్రీస్తుశకం ఒకటో శతాబ్దంలో తూర్పుదిశగా విస్తరించిన తరువాత జలసిరులతో ఉట్టిపడుతున్న కృష్ణానదీ తీరం వారిని ఆకర్షించింది. కృష్ణమ్మ ఒడ్డున ఉన్న అమరావతిని ముఖ్య పట్టణంగా చేసుకుని క్రీ.శ. 220వరకు రాజ్యమేలారు. గౌతమీపుత్ర శాతకర్ణి. పులోమావి, యజ్ఞశ్రీ శాతకర్ణిలు 225 ఏళ్లపాటు అమరావతి కేంద్రంగానే పాలించారు. ఈ సమయంలోనే బౌద్ధ కేంద్రంగా అమరావతి కీర్తి ప్రపంచవ్యాప్తమైంది. అశోకుడు ఇక్కడ నిర్మించిన మహా బౌద్ధ స్థూపానికి ఆచార్య నాగార్జునుడు మహా ప్రాకారాన్ని నిర్మించి ఈ ప్రాంతానికి ప్రత్యేకత తీసుకొచ్చారు. మౌర్యుల కాలంలోనే ఈ నేలపై వ్యాపించిన బౌద్ధాన్ని ఆచార్య నాగార్జునుడు మరింతగా

విరాజిల్లేలా చేశారు. అమరావతిని బౌద్ధ విజ్ఞాన పీఠంగా మలచారు. ఇక్కడికి దేశవిదేశాల నుంచి విద్యార్థులు, బౌద్ధసన్యాసులూ వచ్చేవారని చరిత్ర పుటల్లో ఉంది. చైనాయాత్రికుడు హ్యూయాన్‌సాంగ్ క్రీస్తుశకం640లోఈ ప్రాంతంలో పర్యటించారు. ఆయన పుస్తకాల్లో ధాన్యకటకం ప్రస్తావన ఉంది హ్యూయాన్ త్సాంగ్ అభిధమ్మ పీఠకాన్ని ఇక్కడే చదువుకున్నారు. శాతవాహనుల తరువాత ఆంధ్ర ఇక్ష్వాకులు, పల్లవులు, తూర్పుచాళుక్యులు ఈ ప్రాంతాన్ని పాలించారు. ఇక్ష్వాకులు, కోట వంశ రాజులు కూడా అమరావతినే రాజధానిగా చేసుకుని పాలన సాగించడం విశేషం. కోటవంశ రాజుల పాలన11వశతాబ్దం వరకు సాగగా అనంతర కాలంలో ఢిల్లీ సుల్తానులు, బహమనీ సుల్తానులు, విజయ నగర రాజులు.. ఇలా వివిధ రాజుల పాలనలో అమరావతి ప్రభ తగ్గింది. ఆ తరువాత 1798లో మళ్లీ స్థానిక జమీందారు రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు కృష్ణా, గుంటూరు జిల్లాల్లో తమ ఆధీనంలో ఉన్న ప్రాంతాలను అమరావతి కేంద్రంగానే పాలించారు. ఆ సమయంలో అమరావతికి మళ్లీ రాజధాని వైభవం దక్కింది. క్రీ.శ.5వ శతాబ్దం నాటి అమరేశ్వ రాలయం చుట్టూ నిర్మాణాలు వెలశాయి.



## చైతన్య కళారీతి

అమరావతి వివిధ కళారీతులకు నెలవు. అశోకుడు ఇక్కడ నిర్మించిన బౌద్ధ స్థూపం ఆంధ్రుల నిర్మాణ ప్రతిభకు తార్కాణంగా నిలుస్తుంది. ఇది అనంతరం కాలంలో పల్లవులు, చాళుక్యుల కాలపు నిర్మాణాలనూ ప్రభావితం చేసింది. అమరావతి శైలిగా ప్రసిద్ధిగాంచిన ఈ రీతిలో శిల్పాల్లో సహజసౌందర్యం ఉట్టిపడుతుంది. అంతేకాదు. అమరావతి శిల్పాలకు వివరణలు అవసరం ఉండనంతగా జీవ చైతన్యం ఉంటుందని.. భావాలను ప్రతిబింబిస్తాయని.. అందుకే ఇక్కడి శిల్పాలకు లేఖనాలు ఉండవని చరిత్రకారులు పేర్కొంటారు.

జువా,సుమిత్ర, సింహళప్రాంతాలపైనా ఈప్రభావం ఉన్నట్లు చరిత్రకారులు చెబుతున్నారు. అమరావతి శిల్పాలను ఇతర ఏ శైలితోనూ పోల్చడానికి వీలులేదని చెబుతున్నారు. ఇక్కడి మహాచైత్యనికి ప్రాకారం నిర్మించడానికి నాగార్జునుడే కారణమైనా ప్రజలు పెద్ద ఎత్తున వితరణ చేశారని లేఖనాల ఆధారంగా తెలుస్తోంది. ఆంధ్రప్రదేశ్‌లో మత నిర్మాణాలకు సంబంధించి ఏ యుగంలోనూ ప్రజలు ఇంత స్థాయిలో భాగస్వాములు కాలేదని, కాబట్టి ఈ చైత్యాన్ని ప్రజాశిల్పంగా అభివర్ణించవచ్చన్నది చరిత్రకారుల అభిప్రాయం.

గాంధార, మధుర శిల్పకళా రీతులతో సమానంగా అమరావతి శిల్పకళారీతికి ప్రాచుర్యం ఉంది. బౌద్ధ ఆచార్యుల జీవిత విశేషాలను తెలపడమే కాకుండా అప్పటి సామాజిక జీవన పరిస్థితులనూ ఇక్కడి శిల్పాలు ప్రతిబింబిస్తాయి.

## ధాన్యకటకంలో విద్యాకటాక్షం

రాజధానిగా కీర్తినార్జించిన అమరావతి విద్యలనగరం గానూ విల సిల్లింది. ఇక్కడి ధాన్యకటక విశ్వవిద్యాలయం ప్రపంచదేశాల విద్యార్థులకు జ్ఞానకేంద్రంగా ఉండేది. ఇది మహా విద్యాలయమనడానికి చారిత్రక ఆధారాలున్నాయి. బౌద్ధలామాతారానాథుడి రచనల్లో దీనిప్రస్తావన ఉంది.

టిబెట్‌లోని విఖ్యాత డాపెంగ్ విశ్వవిద్యాలయానికి ధాన్యకటక విశ్వ విద్యాలయమే ఆదర్శమని చెబుతారు. ఇది సుమారు ఆరు శతాబ్దాల పాటు వేల మంది విద్యార్థులకు విజ్ఞాన కేంద్రంగా ఉందని... దక్షిణ భారతదేశం లోనే అతిపెద్దదిగా ప్రసిద్ధికెక్కిన ధాన్యకటక విశ్వవిద్యాలయం వికాసానికి పునాదులేసిందని చరిత్ర చెబుతోంది.

## సమకాలీన ప్రపంచంలోనూ..

బౌద్ధం విరాజిల్లిన అమరావతి ఈ శతాబ్దంలోనూ ప్రతిష్ఠాత్మక కార్య క్రమానికి వేదికైంది. 2008లో ఇక్కడ 'కాలచక్ర' నిర్వహించారు. బౌద్ధమత గురువు దలైలామా దీనికి హాజరయ్యారు. అమరావతిలో 1.2 ఎకరాల్లో ఆంధ్రప్రదేశ్ పర్యాటకశాఖ పురావస్తు ప్రదర్శనశాల నెలకొల్పింది. ఇక్కడ అమరావతి సహా 14 బౌద్ధ ప్రాంతాల్లో లభ్యమైన శిల్పాలు, ఇతర పురాతన వస్తువులు ఉంచారు.

## బౌద్ధమే కాదు...

అమరావతి అనగానే బౌద్ధారామమన్నట్లుగా స్థిరపడిపోయింది. అశోకుడు ఇక్కడ బౌద్ధస్థూపం నిర్మించాడు. ఆచార్య బుద్ధఘోషుడు అమరావతి ప్రాంతీయుడు కావడం విశేషం. ఆచార్య నాగార్జునుడూ అమరావతి కేంద్రం గానే మహాయానాన్ని వ్యాప్తి చేశారు. క్రీ.శ14వ శతాబ్దంవరకు ధాన్యకటం అమరావతి వర్ధిల్లిందనడానికి ఎన్నో ఆధారాలున్నాయి. శ్రీలంకలో దొరికిన క్రీ.శ. 1344 నాటి శాసనంలో ధాన్యకటక ప్రస్తావన ఉంది. ఆ కాలంలో ధాన్యకటకంలో మహాచైతన్య పునరుద్ధరుణ పనులు జరుగుతున్నట్లుగా ఆ శిలాశాసనంలోఉంది. వజ్రయానమూఇక్కడ విలసిల్లిం దనడానికి ఆధారాలున్నాయి. మైత్రేయ, హేరుక, తారా, వజ్రతార వంటి శిల్పాలు అమరావతిలో తవ్వకాల్లో లభ్యమయ్యాయి. ఇవన్నీ పదో శతాబ్దం నాటివి. ఇక్కడ బౌద్ధమేకాదు ఇతరమతాలూ అంతే ప్రాధాన్యంగా విలసిల్లాయి. ముఖ్యంగా హిందూ, జైన మతాలకూ ఇది ముఖ్యకేంద్ర మనడానికి చారిత్రక ఆధారాలున్నాయి. పంచారామాల్లో ఒకటైన అమరేశ్వరాలయం అమరావతి లోనే ఉంది. ఇందులో పన్నెండో శతాబ్దం నాటి శాసనాలున్నాయి.

## అమరావతి కేంద్రంగా 108 శివాలయాల ప్రతిష్ఠ

రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు గుంటూరు జిల్లా అమరావతిలో ఉంటూ ఆంధ్రప్రాంతంలో 108 శివాలయాల ప్రతిష్ఠ చేశారు. అమరావతి కేంద్రంగా పాలించిన ఆయనకు బ్రిటీష్ ప్రభుత్వం 1802లో నందిగామ పరగణాకు జమిందారీ నగదుగా ఇచ్చింది. ఆ తర్వాత ఆయన శివాలయాల నిర్మాణాలను చేయించారు. నందిగామ శివాలయాన్ని ఆయనే నిర్మిం చారు. ఈ శివాలయంలోని నందీశ్వరుని



వల్ల ఒకప్పుడు నందిగ్రామంగా పిలువబడి కాలక్రమంలో నందిగామగా ప్రసిద్ధి పొందింది. నవ్యాంధ్ర నూతన రాజధాని అమరావతిలోకి నందిగామ ప్రాంతం చేరింది.

# మన చరిత ఘన చరిత

ఆంధ్ర భోజుడు నడయాడిన నేల...

శ్రీకృష్ణదేవరాయలకు... నవ్యాంధ్ర రాజధాని అమరావతికి అవినా భావ సంబంధం ఉంది! అమరావతి ప్రాంతంలోని గ్రామాల పేర్లన్నీ దాదాపు రాయల కాలంలో వచ్చినవే! ఉద్దండరాయుడు... రాయల వారి కొలువులో గొప్ప సేనాని. శ్రీకృష్ణదేవరాయలకు అత్యంత ప్రీతిపాత్రుడు. రాయల వారి సామ్రాజ్య విస్తరణలో కీలక నాయకుడు. రణతంత్రంలో ఆరితేరినవాడు. ఆంధ్రుల రాజధాని అమరావతికి శంకుస్థాపన జరగబోతున్న ఉద్దండ రాయునిపాలెం ఆయన పేరిట ఏర్పడిన గ్రామం కావడమే విశేషం. సామ్రాజ్య విస్తరణకు శ్రీకృష్ణ దేవరాయలు విజయనగరం నుంచి బయలు దేరారు. మార్గమధ్యలో స్థానిక సంస్థానాలను, చిన్న, చిన్న రాజ్యాలను స్వాధీనం చేసుకుంటూ గోదావరి నదిని దాటుకుని తెలంగాణ ప్రాంతంలో అడుగుపెట్టారు. నేల కొండపల్లికి చేరుకున్నారు. ఆరంభంలోనే అక్కడి గజపతిరాజుపై యుద్ధం ప్రకటించారు. కుమారుడు, భార్య మరణించి ఉండటంతో అప్పటికే గజపతిరాజునిర్వేదంలో ఉన్నాడు. యుద్ధం చేసే ఓపిక లేక రాయలకు లొంగిపోయాడు. ఆ తర్వాత గజపతుల ఆధీనంలో ఉన్న (గుంటూరు, కృష్ణాజిల్లాలు) ప్రాంతంపై రాయలు దృష్టి సారించారు. తొలుత కృష్ణానది మీదుగా ప్రస్తుత గుంటూరు జిల్లాకు చేరుకున్నారు. గజపతుల ఆధీనంలోఉన్న కొండవీడు కోటపై మెరుపుదాడి చేసి స్వాధీనం చేసుకున్నారు. ఆ తర్వాత కొండపల్లి ఖిల్లాపై కన్నేశారు. ఈ రోజుల్లో రోడ్లు లేవు. వంతెనలు లేవు. నది సన్నగా, వెడల్పు తక్కువగానే ఉన్నా... దీనిని దాటి ప్రస్తుత కృష్ణాజిల్లాలోకి ప్రవేశించటానికి రాయలకు చాలాసమయమే పట్టింది. అయినా పట్టువదలని విక్రమార్కుడిలా నదిని దాటి కొండపల్లి దుర్గంపై దాడికి ప్రయత్నించారు. ఆసమయంలో భారీవర్షాలు కురవటంతో శ్రీకృష్ణ దేవరాయల ప్రయత్నం ఫలించలేదు. దీంతో, యుద్ధాన్ని తాత్కాలికంగా వాయిదా వేసుకుని నదిని అతి కష్టంమీద దాటుకుంటూ తిరిగి వెనకకు మరలారు. ఈ నేపథ్యంలో, కొండపల్లి వెళ్లడానికి ముందు, యుద్ధ విరామ సమయంలో, తర్వాత అంతా శ్రీకృష్ణదేవరాయలు బస చేసిన ప్రాంతమే కాలక్రమంలో రాయపూడి అయింది. కృష్ణా తీరంలోని ఈ రాజధాని గ్రామం లోనే ఇప్పుడు పరిపాలనా భవనాలు రాబోతున్నాయి. రాయల సేనాని

ఉద్దండరాయుడు బస చేసిన ప్రాంతమే ఉద్దండరాయునిపాలెంగా మారింది. రాయల వారు తులు వంశస్థులు అవడంతో అక్కడ ఉన్న ప్రధాన పట్టణానికే తులూరుగా నామకరణం చేశారు. ఇప్పుడు అది తుళ్లూరుగా రూపాంతరం చెందింది. రాయలవారికి సామంతుడుగాఉన్న అబ్బరాజు పేరిట అబ్బరాజు పాలెం. మరోసామంతుడు వెంకటప్ప పేరిట వెంకటపాలెం అవతరించాయి.

## నవ్యాంధ్ర రాజధాని

గుంటూరు జిల్లాలోని తుళ్లూరు, తాడేపల్లి, మంగళగిరి మండలాల్లోని 29 గ్రామాల పరిధిలో రాజధాని నిర్మాణం జరుగుతోంది. ఈ ప్రాంతం విజయవాడ, గుంటూరు నగరాలకు మధ్యలో ఉంటుంది. అటు శ్రీకాకుళం నుంచి ఇటు చిత్తూరు వరకు అన్ని ప్రాంతాల ప్రజలకు సమాన దూరంలో ఉండాలన్న ఉద్దేశంతో రాజధాని నిర్మాణానికి ప్రభుత్వం ఈ ప్రాంతాన్ని ఎంపిక చేసింది. శివరామకృష్ణన్ కమిటీ ఈ ప్రాంతం రాజధానికి అనుకూలం కాదని చెప్పినా... ప్రజల సౌలభ్యాన్నే పరిగణనలోకి తీసుకున్న ప్రభుత్వం రాజధాని నిర్మాణం ఇక్కడే చేపట్టాలని నిర్ణయించింది.

### వాస్తుకి పెద్దపీట...!

వాస్తు సిద్ధాంతాన్ని పరిగణనలోకి తీసుకునే అమరావతి నిర్మాణానికి ఈ ప్రాంతాన్ని ఎంపిక చేసినట్టు ఈ ప్రక్రియలో కీలక భూమిక నిర్వహించిన వాస్తు సిద్ధాంతి ఒకరు తెలిపారు. 'కృష్ణానదికి దక్షిణతీరంలో నవ్యాంధ్ర రాజధాని అమరావతి నిర్మాణం జరగనుంది. ఈ ప్రాంతంలో కృష్ణానది ఉత్తర వాహినిగా ప్రవహిస్తోంది. ఇక్కడి మట్టి నలుపు, తెలుపు కలగలసిన రంగులో ఉంటుంది. దీనికి తత్వగుణం ఎక్కువ. కాబట్టి ఇక్కడ చేపట్టే నిర్మాణంసాఫీగా, ఎలాంటిఅవరోధాలు లేకుండా సాగిపోతుంది. రాజధానుల్ని వనదుర్గం,జలదుర్గం, గిరిదుర్గం అని మూడు రకాలుగా విభజిస్తారు. వనదుర్గం అంటే అడవిలో నిర్మించేది. గిరిదుర్గం కొండపై నిర్మించేది. అమరావతి నిర్మాణం నది ఒడ్డున జరుగుతోంది కాబట్టి, జలదుర్గం విభాగంలోకి వస్తుంది." అని ఆయన పేర్కొన్నారు. "ఇడానాడి, పింగళనాడి, సుషుమ్ననాడి అని మూడురకాలు ఉంటాయి. వీటి మధ్యస్థానమే బ్రహ్మనాడి. సీడ్‌కేపిటల్ ఈ బ్రహ్మస్థానంలోకి వచ్చేలా జాగ్రత్తలు తీసుకున్నారు. ప్రాచీన వాస్తు, జ్యోతిషశాస్త్ర సిద్ధాంతాల్ని పరిగణనలోకి తీసుకున్నారు" అని ఆయన తెలిపారు.

## చారిత్రక నేపథ్యం..!

నవ్యాంధ్ర రాజధాని ప్రాంతానికి ఎంతో చారిత్రక, ఆధ్యాత్మిక నేపథ్యం కూడా ఉంది. ఆచార్య నాగార్జునుడు నడయాడిన నేల ఇది..! బౌద్ధం ఉజ్వల స్థాయిలో విరాజిల్లిన ప్రాంతంఇది. ఆంధ్ర శాతవాహనులు ధాన్యకటకం రాజధానిగా సుదీర్ఘకాలం రాజ్యపాలన చేసిన ప్రాంతంఇదే. కాకతీయ మహారాణి రుద్రమదేవి ఏలుబడిలోనూ ఈ ప్రాంతంఉంది. ఆంధ్రభోజ బిరుదాంకితుడైన శ్రీకృష్ణదేవరాయలు ఏలుబడిలోనూ ఈ ప్రాంతం ఉంది. ఆయన కొండపల్లి దుర్గాన్ని జయించేందుకు వెళుతూ కృష్ణానది ఉధృతంగా ప్రవహిస్తుండటంతో ఈప్రాంతంలో బసచేశారని, ఆయన తుళువ వంశస్తుడు కాబట్టి ఈ ప్రాంతానికి తుళ్లూరు అనిపేరు వచ్చిందని చెబుతారు. ఆయన సేనాని ఉద్దండరాయుడు బస చేసిన ప్రాంతమే ఇప్పుడు రాజధాని శంకుస్థాపన జరుగుతున్న ఉద్దండరాయునిపాలెం. రాజధాని ప్రాంతాన్ని మూడు భాగాలుగా విభజించి అభివృద్ధి చేయాలన్నది ప్రభుత్వ సంకల్పం. దీన్ని సీఆర్‌డీఏ, రాజధాని అమరావతి, సీడ్ కేపిటల్ అని మూడు విబాగాలుగా చేసింది. కృష్ణా, గుంటూరు జిల్లాల్లో 8 వేల చదరపు కిలో మీర్లకుపైగా ప్రాంతాన్ని సీఆర్‌డీఏ ప్రాంతంగా గుర్తించింది. దీనిలో రాజధాని అమరావతి నగరాన్ని 217 కి.మీ విస్తీర్ణంలో నిర్మిస్తోంది. మళ్లీ అమరావతిలో కేంద్ర రాజధాని ప్రాంతం (సీడ్ కేపిటల్) 16.9 చ.కి.ఈ విస్తీర్ణంలో ఉంటుంది. రాజధాని ప్రాంతం, అమరావతి నగరం, సీడ్ కేపిటల్ అభివృద్ధి ప్రణాళికలు సిద్ధం చేసే బాధ్యత సింగపూర్ ప్రభుత్వానికి అప్పగించింది. సింగపూర్ ప్రభుత్వం దశల వారీగా సీఆర్‌డీఏ అభివృద్ధికి స్థూల ప్రణాళిక, అమరావతి బృహత్ ప్రణాళికలు అందజేసింది. ప్రభుత్వం మొదట సీడ్ కేపిటల్‌ను అభివృద్ధి చేయనుంది. 22న ప్రధాని నరేంద్రమోదీ చేతుల మీదుగా శంకుస్థాపన కార్యక్రమం జరిగినది.

## ఆకర్షణీయం

అమరావతి నిర్మాణం 217 చ.కీ.మీ. విస్తీర్ణంలో జరుగుతుంది. భవిష్యత్ అవసరాల్ని దృష్టిలో ఉంచుకుని 391 చ.కి.మీ పరిధిలో అభివృద్ధి ప్రణాళికలు సిద్ధం చేశారు. రాజధాని నిర్మాణం మాత్రం 217 చ.కి.మీలకే పరిమితం. అమరావతిలో 2050 నాటికి 40 లక్షల జనాభా నివసిస్తారని అంచనా. 'అమరావతి' నిర్మాణానికి 35 ఏళ్ళు పడుతుంది. మూడు

అంచెల్లో నిర్మిస్తారు. అమరావతిని ఆకర్షణీయ నగరంగా తీర్చిదిద్దేందుకు ఆరు లక్ష్యాలు నిర్దేశించుకోవాలని సింగపూర్ ప్రభుత్వం బృహత్ ప్రణాళికలో పేర్కొంది. ఆర్థిక, సామాజిక, పర్యావరణం అనే మూడు మూల స్తంభాలపై అమరావతి నిర్మాణం జరగాలని, 1. అందరికీ ఉపాధి, గృహ వసతి 2. ప్రపంచస్థాయి మౌలిక వసతుల కల్పన 3. ప్రత్యేక అస్థిత్వం, వారసత్వ పరిరక్షణ 4. నాణ్యమైన జీవనం 5. వనరుల సమర్ధ నిర్వహణ 6. పచ్చదనం, పరిశుభ్రత అనేవి మౌలిక లక్షణాలు లక్ష్యాలు కావాలని పేర్కొంది. వీటన్నిటికీ మించి అడుగడుగునా ఆధునిక సాంకేతిక పరిజ్ఞాన వినియోగం జరగాలని పేర్కొంది.

## ఆధునికత, సంప్రదాయాల సమ్మేళనం..!

సింగపూర్ ప్రభుత్వం ఆధునికత, సంప్రదాయాల కలబోతగా ప్రభుత్వం ప్రణాళిక రూపొందించింది. రాజధాని అమరావతికి సీడ్ కేపిటల్ గుండె వంటిది. ప్రభుత్వ పాలనా కేంద్రం ఇదే..! సచివాలయం, శాసనసభ, రాజ్‌భవన్, హైకోర్టు, వివిధప్రభుత్వ కార్యాలయాలు,ముఖ్యమంత్రి, మంత్రులు, ఉద్యోగుల నివాస భవనాలన్నీ ఇక్కడే వస్తాయి. సీడ్ కేపిటల్‌ను అమరావతి గవర్నమెంట్ కోర్ పాలనాప్రాంతం. డౌన్‌టౌన్ ప్రధాన వాణిజ్య ప్రాంతం. గేట్‌వే సీడ్‌కేపిటల్‌కి, రాజధాని నగరానికి ముఖద్వారం. వాణిజ్య, వినోదఅవసరాలు తీర్చేందుకు వాటర్‌ఫ్రంట్. రాజధాని కేంద్రప్రాంత నిర్మాణం1694 హెక్టార్లలో (16.9చ.కి.మీ) జరుగుతుంది. 2018 నాటికి ప్రభుత్వ భవనాల నిర్మాణంపూర్తిచేయాలని ప్రభుత్వంలక్ష్యంగా నిర్ణయించు కుంది. మూడు లక్షల జనాభా నివసించేలా సీడ్ కేపిటల్ నిర్మిస్తారు.

## ధరణికోట... ధాన్యకటకం

బుద్ధుడే కాలచక్రతంత్రాన్ని ధాన్యకటకంలో బోధించినాడని, దశ బలుడు (బుద్ధుడు) ధారణులను నిక్షిప్తం చేసినందునే 'ధారణికోట' (ధరణి కోట) అనే పేరు వచ్చిందనే కథలు ప్రచారంలో ఉన్నాయి. ధాన్యకటకానికి వజ్రపర్వతం అనే పేరున్నట్లు సింహళ గ్రంథాల ద్వారా తెలుస్తోంది. ధాన్య కటక సమీపంలోని కొండగహలో వజ్రపాణి అర్చన జరుగుతుందని ధార ణులు (మంత్రాలు) తయారు చేస్తారని హుయాన్‌సాంగ్ రాశాడు. వజ్రయాన సిద్ధాంత కర్తయైన సిద్ధనాగార్జునుడు ఆంధ్రదేశవాసి అని రామిరెడ్డిపల్లి శాసనం వల్ల తెలుస్తున్నది. మూడో బౌద్ధసంగీతికి (క్రీస్తు పూర్వం 251)

పూర్వమే ఆంధ్రదేశంలో బౌద్ధం జనాదరణ పొందినట్లు ధాన్యకటకం దగ్గర ఇటీవలి త్రవ్వకాల్లో లభించిన పురావస్తు సాక్ష్యం సూచిస్తోంది. ధాన్యకటకంలో ఇటీవల బయల్పడిన శాసనాన్ని బట్టి అచట బౌద్ధభిక్షకులు 'వంద నామగోష్ఠి'గా ఏర్పడ్డారని తెలుస్తోంది. బౌద్ధమత వ్యాప్తివల్ల క్రమంగా తెగలతత్వంపోయి.... ఆంధ్ర తెగలన్నీ శాతవాహన నాయకత్వంలో సమైక్యమై సామ్రాజ్య నిర్మాణానికి మార్గం సుగమమైంది.

## అహెూ... అమరావతి స్తూపం

అమరావతీ స్తూపం చాలాఅద్భుత నిర్మాణం. పునాదుల వద్ద స్తూపం వ్యాసం 162 అడుగులు; దాని పైనున్నఅండం వ్యాసం 142 అడుగులు. అమరావతీ ప్రాకారం మనోహర శిల్పసమన్వితం. ఈశిల్పాలకు బుద్ధుని జీవితంలోని పంచకల్యాణములు, బుద్ధ జాతక కథలు, సామాన్య జీవిత దృశ్యాలు కథా వస్తువులు. ఆంధ్రదేశ కళోపాసకులు బుద్ధ భగవానుని పాదపీఠికకు కానుకగా సమర్పించిన పూజా కుసుమములలో అమరావతీ స్తూపంఒకటి.ఇది అమరావతీ గ్రామం నడుమ ఉండటంవల్ల దీనికి 'అమరావతీ స్తూపం' అనే పేరు వచ్చింది.అయితే... ఈ స్తూపంఎప్పుడు నిర్మితమైందో స్పష్టంగాతెలిపే ఆధారాలు లేవు. కొన్నికథలవల్ల...అమరావతీ స్తూప నిర్మాణ అశోక చక్రవర్తి అనితెలుస్తోంది. ఈస్తూపంరాళ్లపై మౌర్యలిపితోశాసనాలున్నాయి. అందువల్ల.. ఇది మౌర్యుల కాలంలోనే నిర్మితమైందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

## ముత్యాల భవానీ ముక్తేశ్వర ఘాట్

పడమటి కనుమల్లో పుట్టిన కృష్ణమ్మ తూర్పుదిశగా పయనిస్తూ సముద్రంలో కలుస్తుంది. మార్గ మధ్యలో ముక్త్యాల వద్ద ఉత్తరంగా దిశ మార్చుకుని మరలా తూర్పుకు ప్రవహిస్తుంది. దీంతో ముక్త్యాలకు కృష్ణానది ఉత్తర వాహినిగా పేరొందింది. చారిత్రక ఆధారాల ప్రకారం ఎందరో మహాపురుషులు. ఈప్రాంతాన్ని సందర్శించి ఈకృష్ణానది ఉత్తర వాహినిలో స్నానాలు



ఆచరించినట్లు తెలుస్తుంది. ఆంధ్ర రాష్ట్రం రెండుగా విడిపోయిన నేపథ్యంలో ఈ ముక్త్యాల వద్దే కృష్ణానది నవ్యాంధ్ర లోకి ప్రవేశించడం విశేషం. ఈ క్షేత్రంలో అతి పురాతనమైన భవాని ముక్తేశ్వరస్వామి, చెన్నకేశవస్వామి, కోటిలింగ హిహర మహాక్షేత్రం, ముక్త్యాల రాజాకోట కలిగిఉన్నాయి. శివరాత్రి పర్వదినాన లక్షలాది మంది భక్తులు ఈ క్షేత్రాన్ని సందర్శిస్తుంటారు.



ముక్త్యాల తరువాత రావిరాల గ్రామం ఉంది. ఇక్కడ పాలేరు కృష్ణానదిలో కలుస్తూ సంగమేశ్వరంగా ప్రసిద్ధి గాంచిన దివ్యక్షేత్రంగా పేరొందింది. రావిరాల అనంతరం దక్షిణాది రాష్ట్రాలలోనే ప్రసిద్ధి పొందిన వేదాద్రి నృసింహ క్షేత్రంకొలువై ఉంది.

## వేదాద్రి :



వేదాద్రిజగ్గయ్యపేటకు చాలాదగ్గరగాఉంది. ఇది విజయ వాడ హైదరాబాదు మార్గంలో ఉంది (జగ్గయ్య పేట) వేదాద్రి ప్రసిద్ధి చెందిన నరసింహక్షేత్రం. నదీ గర్భంలో నరసింహస్వామి లింగాకారంలో వెలిసాడు. భక్తులు ఈ క్షేత్రాన్ని చూడటానికి సంవత్సరమంతా వస్తూనే వుంటారు.

## విజయవాడ :

ఇచ్చట అనుశృతంగా వస్తున్న ఒక కథ వుంది. ఇచ్చట యింద్రకీలాద్రి పర్వతముపయి వెలసిన దుర్గ వుంది. కొండ దిగువ కృష్ణ ఉంది. దుర్గ కృష్ణతో 'నా ముక్కుపోగు అందుకోగలవా" అని సవాలు విసిరిందట. అందుకు కృష్ణ నిబ్బరంగా "ఓ! అందుకోగలను" అందిట అది విని కనకదుర్గ ఫక్కున నవ్వి "నువ్వు నా ముక్కుపోగు అందుకుంటే నేనీ సృష్టిని ఉంచుతానా!" అందిట. ''నువ్వు ఏం చేస్తావో నాకు తెలీదు. నేను నా పంతం నెరవేర్చుకుంటాను" అందిట కృష్ణ.

గెలుపెవరిదన్నది కాలమే నిర్ణయించాలి.

# విజయవాడ నగర చరిత్ర



అనేక పుణ్యక్షేత్రములకు నదీ నదములకు నిలయమైన భారత దేశము నందలి నగరములో విజయవాడ యొక పవిత్ర నగరము. ఇది గొప్ప పుణ్యక్షేత్రము చారిత్రాత్మిక నగరము.

ఈ నగరము నంటి ప్రవహించుచున్న కృష్ణానదియు, ఇంద్రకీలా ద్రిపై శ్రీ కనకదుర్గా మల్లేశ్వర పుణ్యక్షేత్రము, అతి ప్రాచీనమైన విజయేశ్వర ఆలయము, ఇంద్రకీలాద్రిపై ఈశాన్యంలో హనుమంతుని ఆలయము, ఉత్తరంగా ఇంద్రజామాత, శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారి పుణ్యక్షేత్రము అక్కన్న, మాదన్న గుహలు మొదలగు దృశ్యములు యాత్రీకులకు దర్శన యోగ్యములై యున్నవి.

## బీజవాడ-బెజవాడ

పూర్వము కరన్సీ వాడుకలో లేని సమయములో విజయవాడ నగర పరిసర రైతులు తామ పండించిన ధాన్యములు, జొన్నలు, మినుములు, పెసలు, రాగులు, సజ్జలు మొదలగు బీజములు తమ బండ్లపై తీసుకువచ్చి ఇచ్చట నిలువ వుంచి, రైతులు తమ అవసరాలకు అవసరమైన బీజములు తీసుకుని తాము పండించిన బీజములు వారికి ఇచ్చేవారు. ఇలా బీజములు మార్చుకునే వారు గనక ఈ నగరమునకు బీజవాడ అనిపేరు. బ్రిటీషువారి పరిపాలనలో ఈ నగరమును బెజవాడగా మార్చారు.

## ఇంద్ర కీలుడి జన్మస్థలమే కీలాద్రి



శక్తి స్వరూపిణీ... త్రిలోక సంచారిణీ... వదమా... కనకదుర్గమ్మ కొలువున్న కొండ ఇంద్రకీలాద్రి, కృష్ణమ్మ పరవళ్లు దీనికి తాకుతుంటాయి. ఇంద్ర కీలాద్రి పేరు రావడానికి ఒక కథ ప్రచారంలో ఉంది. పూర్వం ఇంద్రకీలుడు అనే యక్షుడు ఆదిపరాశ్తి అయిన దుర్గాదేవి కటాక్షం కోసం ఘోర తపస్సుచేశాడు. అతని తపస్సుకి మెచ్చిన అమ్మ వారు వరం కోరుకోమంది. జగన్మాతను అనేక

విధాలా స్తుతించాడు. ఆయన అమ్మా నీవు ఎల్లప్పుడూ నా హృదయంలో నివసించు అని కోరాడు. ఓయక్షా... నీవు పరమ పవిత్రమైన కృష్ణానది ఒడ్డున పర్వత రూపాన్ని ధరించు అని అమ్మవారు అన్నారు. "కృతయుగంలో అసుర సంహారానంతరం నేను నీ పర్వత మధ్యస్థలమందు కొలువై ఉం టాను" అని వరం ప్రసాదించింది. కాలానంతరంలో ఇంద్రకీలుడు పర్వత రూపాన్ని పొంది దేవి ఆవిర్భావం కోసం ఎదురు చూడసాగాడు. దుష్టుడైన మహిషాసురుని సంహరించాక దుర్గాదేవి కీలుడికిచ్చిన మాట ప్రకారం ఇంద్రకీలాద్రిపైన స్వయంభువుగా వెలిశారు. ఇంద్రాది దేవతలు నిత్యం దేవికి పూజలు చేయసాగారు. ఆనాటినుంచి ఈకీలపర్వతానికి ఇంద్రకీలాద్రి అని పేరు వచ్చింది.

**ఆలయ విశిష్టత :** దక్షిణ భారతదేశంలో సుప్రసిద్ధ పుణ్యక్షేత్రాలలో ఈ కోవెల ఒకటి. అతి ప్రాచీనమైన శక్తిపీఠం శ్రీ దుర్గామల్లేశ్వరస్వామి దేవస్థానం. **దర్శనఫలం :** దుర్గమ్మను ఆరాధిస్తే దుర్గతులు తొలగుతాయని భక్తుల నమ్మకం. ఆమె కరుణాకటాక్షాలతో ఆయురారోగ్యాలు కలుగుతాయని ప్రశస్తి.

**మల్లేశ్వరస్వామి :** ఇంద్రకీలాద్రిపై పరమేశ్వరుడు కూడా కొలువై ఉండేలా బ్రహ్మ ప్రతిష్టించారు. బ్రహ్మ మల్లెలతో స్వామి వారిని పూజించడం మల్లేశ్వరస్వామి అనే పేరు స్థిరపడిపోయింది.

**కొండ మధ్యలో కొలువై ఉంటానని కీలుడికి వరమిచ్చిన దుర్గమ్మ:**



దుర్గాదేవి మహిషాసుర సంహారానంతరం, అదే స్వరూపంతో ఇక్కడ స్వయంభువుగా రౌద్ర రూపంలో వెలిశారు. గమనించిన జగద్గురువు ఆదిశంకరాచార్యులు అమ్మవారిని శాంతి స్వరూపిణిగా మార్చి ఇక్కడ మంత్ర శక్తితో శ్రీచక్ర యంత్రాన్ని ప్రతిష్టించారు. నిత్యార్చనలు, కుంకుమార్చనలు అన్నీ మూలవిరాట్‌తో పాటు అమ్మవారి ప్రతిరూపమైన శ్రీచక్రానికి నిర్వహిస్తారు. శరన్నవరాత్రి మహోత్సవాలలో వివిధాలంకార భూషితమైన

అమ్మవారికి నవా వరణార్చన అత్యంత ప్రశస్తమైంది. ఆ తల్లికి ప్రీతిపాత్రమైన కుంకు మార్చనలో పాల్గొన్న భక్తులు పొందే ఆధ్యాత్మిక మహదానందం మరువ లేనిది.

**ఇంద్రకీలాద్రికి ఈశాన్యంలో హనుమంతుడి దేవాలయం :**
ఇంద్రకీలాద్రికి ఈశాన్యంలో ఉన్న శ్రీహనుమద్ దీక్షాపీఠానికి వందేళ్ల చరిత్ర ఉంది. ఈ దేవాలయాన్ని స్వాతంత్ర్యానికి ముందే నిర్మించారు. సయ్యద్ అప్పలస్వామి అనే అతను బాటసారుల కోసం బెజవాడలో పలుప్రాంతాల్లో బావులు తవ్వించాలని భావించారు. 1913వ సంవత్సరంలో కొండ మూల ప్రాంతంలో బావిని తవ్వించాలని నిర్ణయించుకున్నాడు. ఆ రోజు రాత్రి స్వామివారు అతనికి స్వప్నంలో కనిపించి మరింతగా బావిని తవ్వినట్లయితే తాను కనిపిస్తానని చెప్పాడట. బావిని మరింతగా తవ్వినప్పుడు స్వామి వారి విగ్రహంబయటపడింది. ఆనాటి నుంచి 1980 దాకా ఒక చిన్నపాకలో స్వామివారిని భక్తులు పూజించేవారు. తరువాత గుడి కట్టించారు. రాంపిళ్ల సూర్యనారాయణ అనే భక్తుడు హనుమద్భక్తుడు. అతను ఈ దేవాలయంలో హనుమత్ దీక్షాపీఠాన్ని స్థాపించి, స్వామివారి మాలాధారణ ప్రారంభించారు. ప్రతి ఏడాది పొరుగు రాష్ట్రాల నుంచి అనేక మంది భక్తులు ఇక్కడకు వచ్చిస్వామి వారి మాలాధారణ స్వీకరిస్తారు. స్వామివారిని ప్రార్థించిన వారికి నవగ్రహానుగ్రహంతో పాటుగా ఆత్మస్థయిర్యం కలుగుతుందని, విద్యార్థులు పోటీ పరీక్షల్లో ఉత్తమ ఫలితాలు సాధించటం అనేకమందికి అనుభవంలోకి వచ్చిందని భక్తులు చెప్తుంటారు.

**కనకపురి :** పూర్వమీ పట్టణమును మాధవ వర్మయను రాజు పాలించెను. ఆరాజు గారి కుమారుడొకనాడు రథము నెక్కిరాజ నగర వీధులలో తిరుగు చుండగా, రథముక్రింద పడి, తలపై బుట్టపెట్టుకొని బేరము చేసి జీవించే యొక ముసలిది మరణించెను. ధర్మము తప్పని మాధవవర్మ దండనీతి క్రమంబున తన కుమారునకు మరణ దండన విధించెను. అపుడు విశ్వేశ్వరా స్వామివారు యారాజుగారి నిష్పక్షపాత బుద్ధికి కానందించి, రాజకుమారుని బతికించి అచట కనక వర్షము కురిపించినందున, ఈ పట్టణమునకు కనకపురి యను నామము ఏర్పడినది.రాజేంద్ర చోళ నగరము పూర్వం యీ పట్టణమును యుద్ధమల్లుడను చాళుక్యరాజును, వాని కుమారుడు విక్రమాదిత్యుడును, వాని తనయుడు రెండవ చాళుక్య యుద్ధమల్లుడు

పూర్వమీ పట్టణమును పాలించిరి. అందువలన యీ పట్టణమునకు రాజేంద్ర చోళ నగరము అని పేరు వచ్చినది.

**విజయ పురి :** ద్వాపరయుగంబున పాండవ మధ్యముడైన అర్జునుడీ పర్వతము మీదనే తపస్సు చేసి శంకరుని మెప్పించి పాశుపతాస్త్రమును పొందిన సందర్భమున అర్జుననకు విజయ నామమును యీ పురికి విజయపురి నామంబులు కలిగినవి.

**విజయవాడ :** సుప్రసిద్ధులై తూర్పు చాళుక్యులలో రెండవ విక్రమాదిత్యుడొకడు ఇతడు మహావీరుడు నరేంద్ర మృగరాజ అను బిరుదు ధరించి వేంగి సామ్రాజ్య ప్రతిష్టను పునరుద్ధరించాడు. కేవలము యుద్ధాలు చేయడమే కాకుండా కళాభిమాని. తాను పోరాడిన 108 యుద్ధభూముల్లో నరేంద్ర మృగేశాల పేరున శివాలయాలు నిర్మించాడు. ఆయన ఆస్థానంలో అనేక మంది కవులు, గాయకులు, శిల్పులు, చిత్రలేఖకులు, నటులు పోషింపపడ్డారు. తన రాజ్యంలో అనేక సత్రములు, చలివేంద్రాలు కట్టించాడు. ఆయన పేరుతోనే విజయవాడ ఏర్పడినది.

## రాజులు నడయాడిన నేల

**- మొగలు సైనికులకు విడిది మొగల్రాజపురం**
**- శాతవాహనులు మొదలు ఆంగ్లేయుల వరకు ఎందరో రాజులు ఏలిన ప్రాంతం**
**- జైన బౌద్ధమతాలకూ కేంద్రం**
**- గజపతి రాజుల పేరిట ఎన్నో ప్రాంతాలు**
**- రెండువేల సంవత్సరాల చరిత్ర బెజవాడ సొంతం.**

రాజులు నడయాడిన నేల ఇది. శాతవాహనులు మొదలు ఆంగ్లేయుల వరకు ఎందరో రాజులు ఏలిన ప్రాంతం ఇది. జైన బౌద్ధ మతాలకూ ఇది కేంద్రం. మొగలు సైనికులకు విడిది. అక్కన్న, మాదన్నల సచివాలయం ఇక్కడే. ఇంద్రకీలాద్రిపై అక్కన్న, మాదన్న గుహలు, మొగల్రాజపురం కొండ గుహలు. ఉండవల్లి గుహలు నాటి చరిత్రకు సాక్ష్యాలుగా నేటికి దర్శనమిస్తున్నాయి. బెజవాడ చరిత్ర రెండు వేల సంవత్సరాలకు పైబడినదే. శాతవాహనుల నుంచి ఆంగ్లేయుల వరకు అనేక మంది పరిపాలకులను, వారి పాలనా రీతులను బెజవాడ చూసింది. మొగల్రాజపురం ఉన్నచోట ఒకకోట ఉండేదని ప్రతీతి. హైదరాబాద్ నుంచి బందరు వెళ్ళే మొగలు సైనికులకు ఈకోట విడిదిగా ఉండేదట. శాతవాహనుల నుండి మౌర్య చక్రవర్తులకు

పరిపాలనాధికారం దక్కింది. బౌద్ధ,జైన మతాలు చాళుక్యులు, విష్ణుకుండినుల కాలాల్లో ఇక్కడ ఎంతో ప్రాశస్త్యాన్ని పొందాయి. ఎనిమిదో శతాబ్దం ప్రథమాం కంలో ఒకటవ విష్ణువర్ధనుడు విజయవాడను జైన మత కేంద్రంగా రూపొం దించినట్లు శాసనాలు తెలియజేస్తున్నాయి. క్రీ.శ. 927-933 నాటి రెండవ యుద్ధ మల్లుని కాలంనాటి శిలాశాసనం ప్రకారం విజయవాడ 'రాజేంద్ర చోళవరం'గా పిలిపించుకుంది. 'వేంగానాడు'గా పిలవబడుతున్న కోస్తా ఆంధ్రప్రాంతంపై ఆకాలంలో చోళరాజుల ఆధిపత్యంఉంది. 12వ శతాబ్దంలో ఈ ప్రాంతం 'బీజపురం' 'కనకప్రభ' 'కనకపురం' 'జంత్‌పురం' పేర్లతో పిలవబడుతూ వుండేదని చరిత్ర చెప్తుంది. ఈ శతాబ్దంలో విజయవాడ కాకతీయుల, కొండవీటి రెడ్డి ప్రభువుల పాలనలో ఉండేది. 14వ శతాబ్దం నాటికి విజయవాడ సుల్తానుల పాలనలోకి వచ్చింది. 16వ శతాబ్దంలో శ్రీకృష్ణదేవరాయల వారికి గజపతి రాజులకు మధ్య జరిగిన ఒప్పందం ప్రకారం విజయవాడ గజపతి రాజుల పాలనలోకి వచ్చింది. శ్రీకృష్ణదేవ రాయలు తమ 'ఆముక్త మాల్యద'లో విజయవాడను 'విజయవాటిక'గా పేర్కొన్నారు.

1434 నుంచి 1538 వరకు ఈ ప్రాంతాన్ని ఏలిన గజపతుల్లో ముగ్గురు ప్రసిద్ధులున్నారు. వారే కపిలేశ్వర గజపతి, పురుషోత్తమ గజపతి, ప్రతాపరుద్ర గజపతి. ఈ ముగ్గురూ ఆంధ్రదేశంలో చిరస్థాయిగా నిలిచిపోయే ఊళ్లు కట్టించి, చెరువులను తవ్వించారు. గజపతి రాజ్యాన్ని స్థాపించిన కపిలేశ్వర గజపతి ఎన్నోఅగ్రహారాలు ఇవ్వడంతో ఆంధ్ర ప్రాంతంలో అనేక కపిలేశ్వరపురాలు ఉన్నాయి. కృష్ణాజిల్లా పమిడిముక్కల మండలంలోని కపిలేశ్వరపురం కూడా వాటిలో ఒకటి.

కపిలేశ్వర గజపతి కుమారుడైన పురుషోత్తమ గజపతి పేరిట బెజ వాడకు సమీపంలో నిర్మించిందే పురుషోత్తమ పట్టణం. ఇది ప్రస్తుతం గన్నవరం మండలంలో ఉంది. ఆయన మనుమడైన ప్రతాపరుద్ర గజపతికే విద్యాధరుడనే మరోపేరు ఉంది. ఆయన పేరిట నిర్మించిందే విద్యాధర పురం. కొండపల్లి వద్ద విద్యాధర గజపతి చెరువు అనే తటాకం ఒకటి ఉంది. అందులో ఈ రాజు లక్కపడవపై షికారు చేసేవాడట.

ఈయన భార్య భవానమ్మ. కుమార్తెలు ముత్యాలమ్మ, పైడమ్మల పేరిట నిర్మించిన గ్రామాలే భవానీపురం, ముత్యాలంపాడు, పైడూరుపాడు.

క్రీ.శ. 350–610 మధ్య కాలంలో ఆంధ్రదేశాన్ని పాలించిన విష్ణు కుండినుల కాలంలో ఈపట్టణం ఎంతోప్రాముఖ్యాన్ని పొందింది. విష్ణుకుండి నుల కాలంలో దీన్ని 'బెజవాడ'గా వ్యవహరించినట్లు శాసనాలు చెబు తున్నాయి. నాల్గవ మాధవవర్మ కాలంలో విజయవాడ వైభవం ఉన్నత శిఖరాలను అందుకుంది. ఈ కాలంలోనే సీతానగరం, ఉండవల్లి, మొగల్రాజ పురం, ఇంద్రకీలాద్రి గుహలలో శిల్ప నిర్మాణం జరిగింది. పట్టణ ఓఋణ నిమిత్తం ఉత్తర హిందుస్తాన్ నుండి వచ్చిన 'పటానులపేట', నేటి పటమట, పంటలతో సమృద్ధిగా ఉన్న నాటి 'కంకులపాడు' ఈనాటి కంకిపాడు. పాడిపంటలతో నిండినఅప్పుగి'గొల్లపాడి' నేటి 'గొల్లపూడి', నూనె గానుగలతో అలరారిన అప్పటి 'నూనె' ప్రాంతమే ఇప్పటి 'నున్న'.

## అక్కన్న, మాదన్నల సచివాలయం ఇక్కడే

17వ శతాబ్దంలో తానీషారాజు సలహాదారులైన అక్కన్న, మాదన్నల సచివాలయం బెజవాడలోనే ఏర్పాటు చేసుకున్నట్టు తెలుస్తోంది. మరాఠీల దాటికి తట్టుకోలేక నైజాము నవాబు ఫ్రెంచిదొర 'బుస్సీ' సహాయాన్ని అర్థించా డని చరిత్రచెబుతోంది. అందుకు ప్రతిఫలంగా ఫ్రెంచి వారికి నైజాము నవాబు కొండపల్లి, రాజమండ్రి, చికాకోల్ (ప్రస్తుతం శ్రీకాకుళం జిల్లా) తాలూకాలను అప్పగించాడు. 1673లో బెజవాడ సందర్శించిన ఫ్రెంచి యాత్రికుడు ట్రావెర్నియస్ బెజవాడలోని కట్టడాలను, ప్రజల జీవన సరళిని మెచ్చుకున్నాడు. 1762లో కొండపల్లి ఖిల్లా బ్రిటీష్ వశం కాగా విజయవాడ ఆంగ్లేయుల పరిపాలనలోకి వచ్చింది. 1770వ సంవత్సరంలో కలువకొలను చినరాయుడు అనే జమిందారు కోటను నిర్మించాడు. అదే ఈనాటి 'వన్‌టౌన్' గా విరాజిల్లుతోంది. 1855 లో సర్‌ఆర్థర్ కాటన్ పర్యవేక్షణలో కెప్టెన్ ఆర్ అనే ఇంజనీరు నేతృత్వంలో కృష్ణానదిపై ఆనకట్ట నిర్మించారు. ఆనకట్ట నిర్మాణానికి ముందు ఆ ప్రదేశంలో ఒక చిన్న బెస్తవారి పల్లె మాత్రమే ఉండేదట. ఆనకట్ట నిర్మాణ పనుల పర్యవేక్షణకు కెప్టెన్ ఆర్ టెలిస్కోప్ సహాయంతో పర్యవేక్షణ కొండపై నుంచి చేసేవారు. ఆ కొండ ఇప్పటి 'గాంధీకొండ'గా రూపాంతరం చెందింది. కెప్టెన్ ఆర్ 1858లో 'ఆంగ్లో వెర్నాక్యులర్ సూకల్'ను ఏర్పాటు చేశారు. 1860లో ఈ స్కూలు చర్చి మిషన్ సొసైటీకి అప్పగించారు. ప్రస్తుతం గాంధీజీ మున్సిపల్ హైస్కూలు ఉండేదట.

విజయవాడ నడిబొడ్డులో నుంచి ప్రవహించే 'ఏలూరు రైవీస్, బందరు కాల్వలు విజయవాడకు 'తూర్పు ప్రాంతపు వెనిస్' అనే ఖ్యాతిని తెచ్చాయి. క్రీ.శ.ఆరవ శతాబ్దము నాటికీ పురమును చోళరాజులు పాలింప సాగిరి. నాడీనగరము తూర్పున కంకిపాడు; దక్షిణమునకృష్ణానది, పడమర గొల్లపూడి,ఉత్తరమున ఆగిరిపల్లివరకూ వ్యాపించినందున డెబ్బదైదు చదరపు మైళ్ళ విస్తీర్ణముగలదై యున్నది. చోళ భూపాలుని కోటయు నీ యింద్రకీలాద్రి యందే యుండెడిది. ఏడవ శతాబ్దమున జరిగిన యుద్ధములో ఉత్తరహిందూ స్థానము నందలి చాళుక్య రాజులీ కనకపురమును స్వాధీనము చేసుకొని, వేంగి రాజ్యమునకు ముఖ్యపట్టణమిచట నెలకొల్పిరట. నాటి చాళుక్యులకోట క్రీ.శ882వ సంవత్సరముదాక తెలుగురాజుల యధీనము నందే గణ్యత కెక్కినట్లు తెలియుచున్నది. బ్రిటీషుయుగమున నీదెలుగుల పాలనయందున్న కోట నాయాంగ్లే యులు ధ్వంసమొనరించిరి. స్వదేశాభిమానధనులైన తెలుగు రాజులు దానిని 827 ప్రాంతమున తిరిగి నిర్మించిరి. కాని యంత్రాయుధం బుల సహకారం బులున్న బ్రిటీషువారు రెండవ పర్యాయము నాకోటను 1910లో నేల మట్టము గావించిరి. నేడా కోటకు సంబంధించిన పోలిక లతిస్వల్పముగనే కన్పట్టుచున్నవి.

## పరిసర గ్రామములు

**ముత్యాలంపాడు :** విజయవాడ రాజనగరమైయున్న కాలమున ప్రముఖ ముత్యముల వర్తకులున్న పేట యిప్పుడు ముత్యాలంపాడయినది.

**మొగల్రాజపురము :** మనదేశమును రెడ్డిరాజులు, చోళులు మొదలైనవారు పాలించుచుండగ మొగలువంశీయులను మహమ్మదీయులు యేలిరి. వారి రాజధాని నపుడు కొండపల్లికి చేర్చిరి. అపుడు వారి సైన్యములున్నవాడ యిపుడు మొగల్రాజపురముగ మారినది.

**గొల్లపూడి :** ఇచ్చుట పూర్వము నుండియు యాదవులు నివసించి యున్నం దున, పల్లెయగుటచే దీనిని గొల్లపూడి యనిరి. పూర్వము విజయవాడ రాజనగరమైయున్న కారణమున ప్రభుత్యోద్యోగులు, గొప్ప వ్యాపారులు, ధనవంతులు సామాన్య ప్రజలకు గూడ పాలు, పెరుగు, వెన్న, నెయ్యి మొదలగువాని నీ గ్రామ వాస్తవ్యులు విక్రయించినారట. నాడీ పట్టణమునేలిన రాజులకోటయునిందే యుండెడిది. నేటికినీ కోటకు సంబంధించిన చిహ్నములు కొన్ని యిచట పోల్చుకొననగును.

**పడమట :** ఇది పశ్చిమకీలాద్రి, ఇంద్రకీలాద్రి యందలి పడమర భాగమున నున్న కొండగల గ్రామమును పడమట – పడమటలంక అందురు. కృష్ణవేణి భూతలందున ప్రవహించుచు వచ్చి యింద్రకీలాద్రి యొద్ద భూగర్భమున మార్గ మేర్పరచుకొని పురోగమించినపుడు దాని ప్రవాహవేగమున. కాయజ్ఞాత మార్గంబు చాలకపోయినది. నదీప్రవాహ వేగమునకు నిలువ లేక కొట్టుకొనిపోయిన కొండ యిచట నిలిచినదని. జనవాక్యము వినబడు చున్నది. ఇది విజయవాడకు తూర్పు భాగమున రెండుక్రోసుల దూరమున ఉన్నది.

**నున్న :** ఆదియందీ పల్లెయందు నూనెను తయారు చేయు యంత్రములు గలవారధికముగ నుండిరట.

**సీతానగరము :** సీతానగరమును విజయవాడ నుండి కృష్ణానది వేరు చేయు చున్న కారణంబుననిది కృష్ణామండలమున గాక గుంటూరు మండలమున చేర్చబడినది. ఇది చాలావరకు కొండమీదనే నిర్మింపబడిన జనపదమని చెప్పవలయును. సీతానగరమున వేంచేసియున్న సీతారామాలయము మనో హరముగ నుండును. ఈ సీతారామస్వాముల వారిని గురించే దీనికి సీతా నగరమను నామమేర్పడినది. ఈయూరునకు ఉత్తరముగ కృష్ణ ప్రవహించు చున్నది.

## ఆధ్యాత్మిక గిరి – ఇంద్రకీలాద్రి

ఇంద్రకీలాద్రి పేరు వినగానే గుర్తుకువచ్చేది జగన్మాత దుర్గమ్మ స్వయం భువుగా ఇంద్రకీలాద్రిపై ఉగ్రరూపంలో వెలిసిన దుర్గమ్మ. ఆది గురువు శంకరాచార్యుని శ్రీచక్ర ప్రతిష్టతో కరుణచూపి కనకదుర్గగా మారినది.

## కనకదుర్గా మల్లేశ్వర క్షేత్రము

ఆదియందు ప్రజాపతియైన దక్షుని కుమార్తె సతీదేవి శంకరుని వరించి వివాహమాడినది. అంతకుముందే దక్షునకు శివునిపై దురభిమాన ముద యించినందున యీ వివాహము వానికి యిష్టము లేకపోయినను, సతీదేవి పట్టుదల వలన తప్పలేదు. తరువాత నొకసభలో మహేశ్వరుని నిందించిన దక్షుడు వాని నవమాన పరచనెంచి మహాయజ్ఞముసేయ ప్రారంభించినాడు. దానికి లోకాలోకములలోని వారనందరినాహ్వానించియు కూతురల్లుంద్ర బిలువక నిరాకరించెను. ఆ వార్త నెరింగిన సతీదేవి, పెనిమిటి యనుజ్ఞ

వడసి తండ్రియొద్దకు పోయి మందలించినది. మూర్ఖుడైన దక్షుడు కుమార్తె హితము వినకపోవుటయేగాక అవమానంబుగ మాటలాడి నందున నామె దుఃఖించుచూ మరణించినది.

భార్య యందనురాగముగల శివుండామె మృతకళేబరమును మూపు నందేయుంచుకొని సంచరించుచుండ వాని భీకరఆకారమును గని యెవరును వానిని సమీపించ సాహసింపరైరి. ఆశ్రీహరియే ధైర్యమున తనచక్రాయుధంబున శంకరుని భుజమునందున్న ప్రేతము ఏబది ముక్కలగు నట్లుగ ఖండించెను. అందొక ఖండమీ యింద్రకీలాద్రిపై కనకదుర్గా మల్లేశ్వర పీఠమైనదని యితిహాసంబులు దెలుపుచున్నవి.

ఆ కాలంబున హిమవంతుడను పర్వతరాజు సంతానములేక ఘోరతపం బొనరింపగ, సతీదేవి వానిగర్భమున పార్వతియై జన్మించినది. శంకరుండామెకు తనయందు గల భక్తి శ్రద్ధాభిమానంబుల పరీక్షించిన యనంతరము నామెను పరిణయంబాడి తన దేహంబున సగభాగంబును పంచియిచ్చెను. ఆ పుణ్యదంపతులీనాటికిని సకల సురాసుర గరడోరగ కిన్నెర కింపురుషాద్యఖిల గణంబులచేత నాదిదంపతులుగ వందనీయులై పూజింపబడుచుండిరి.

ఇది యిటులుండ కశ్యప ప్రజాపతి భార్యలలో దితియందు దయించిన వారు రాక్షసగణమై లోకకంటకులుగ సంచరించుచుండిరి. అదితియందు దయించిన వారు దేవగణమై లోకములచేత నారాధింపబడు చుండిరి. రాక్షసులలో నాకాలమున దుర్గాసుర; శంభాసుర – మహిషా సురాదులు మహాబలవంతులై లోకములనన్నింటిని బాధించు చుండ దేవమునీంద్రాదులు పోయి శంకరునితో మొరబెట్టుకొనిరి. లోక కళ్యాణమునకై మహిషాసురాది రాక్షసులను వధించిన దుర్గాదేవి, యిచట యింద్రకీలాద్రిపై నిలిచినపుడు దేవమౌనీంద్రులు స్తవములుచేసి ప్రార్థించిన కారణమున నద్దేవి యిచట కనకవర్షమును గురిపించి యిందే భక్తపాలనంబుకై స్థిరముగనుండ నంగీకరించెను. మఱికొంతకాలమునకు భక్తజన వశంకరుండగు శంకరుండు లోకంబుల బాలింప, ప్రసన్నుడై దుర్గప్రక్కన నిలుచుటచే నీ ప్రదేశంబు శ్రీ కనకదుర్గా మల్లేశ్వరస్వామి క్షేత్రమై పురాణ ప్రసిద్ధిగాంచినది. ఈ దుర్గాలయంబునకు సమీపంబున చింతామణి దుర్గ; నవదుర్గలను చెక్కబడిన గుహ యీనాటకిని యాత్రికుల నాకర్షించుచున్నది.

ప్రతి సంవత్సరము ఇచట ఆశ్వయుజ మాసంబున దేవీ నవరాత్ర్యుత్స వంబు లతిమనోహరంబుగ జరుగుచుండును. ఆ తొమ్మిది దినములందిచట దేవి కలంకారములు ప్రత్యేకముగ చేయుచుందురు. ఆ పర్వదినములందేగాక ప్రతిదినము నీ దేవికి భక్తులు వారి వారి మొక్కుబడులను చెల్లించుచుందురు. దక్షిణ భారతంబునం దిది యొక మహాపుణ్య క్షేత్రము.

కృష్ణానదిలో స్నానముచేసి శ్రీ కనకదుర్గా మల్లేశ్వర స్వామిని దర్శిం చిన వారికి జన్మజన్మాంతర పాపంబులు హరించి శివసాయుజ్యము నిస్సంశ యముగ ప్రాప్తించును. భక్తులిచట యాత్రికుల సౌకర్యార్థము సత్రములు, మందిరములు, నిర్మించుచుండిరి. ప్రభుత్వము వారిచే విద్యుద్దీపములు, నీటివసతులు కూడ నేర్పరుపబడినవి.

## దుర్గమ్మ విగ్రహ విశేషం

దుర్గ విగ్రహం అతి భయంకరమైనది. అష్టభుజములు కల దేవత. సింహ వాహనాన్ని అధిరోహించి మహిషాసురుని శిరస్సుపై శూలంతో పొడుస్తూన్న భంగిమలో వున్నది. రత్నాభరణాలతో, స్వర్ణకవచంతోను అలంకరించినపుడే త్రిలోక సుందరివలె కనిపిస్తుంది.

దుర్గాదేవికి వామపార్శ్వంలో చిన్న వినాయకుని విగ్రహం వున్నది. ఈయనను లక్ష్మీగణపతి అంటారు. దక్షిణ భాగమున కల గుహలో చింతామణి దుర్గ విగ్రహం ఉన్నది. అమ్మదారికెదురుగా చిన్న హనుమంతుని ఆలయం. ఉత్తరదిశన నటరాజఆలయము. అక్కడనే సిద్ధిగణపతి సుబ్రహ్మ ణ్యం విగ్రహాలు. కామేశ్వరీదేవి విగ్రహము శిల్ప సౌందర్య ప్రభావిభాసిత ములై భక్తుల హృదయాలను ఆనందంతో పల్లవింప జేస్తూ ఉంటాయి.

దుర్గమ్మ విగ్రహం అతి భయంకరంగా ఉంటున్నందున ఆదిశంకరులు ఈ క్షేత్రాన్ని దర్శించినపుడు శాంతి యంత్రములు చెక్కించి వామ పార్శ్వమున ప్రతిష్టించిరి. అది మొదలు ఆ తల్లి మందస్మిత సుందర వదనారవిదంతో భక్త జనులకు సాక్షాత్కరిస్తున్నది. ఆదిశంకరులు చెక్కించిన యంత్రాలకు "శ్రీచక్రం" మేరుచక్రం అని పేర్లు. అమ్మవారు ఏకాంతంగా ఉండటం క్షేమకరంగాదని ఆదిశంకరులు ఉత్తరపు ప్రక్క మల్లేశ్వరాలయాన్ని కట్టిం చారు. దీనికి దక్షిణంగా శంకర మఠాన్ని నిర్మించారు. శంకరాచార్యుల వారిపాలరాతి విగ్రహం ఈమఠంలో ఉన్నది. ఈక్షేత్రపాలకుడు మల్లికేశ్వర స్వామి.

## ఉండవల్లి




ఉండవల్లి గుహలు గుంటూరు జిల్లాలో కృష్ణాజిల్లాలో కృష్ణానదీ తీరాన ఉన్నాయి. ఇది చరిత్ర ప్రసిద్ధిచెందినది. ఇది అనంతపద్మనాభ స్వామివారి సిద్ధక్షేత్రం. గుహలో అనంత పద్మనాభస్వామి శయినించినట్లు విగ్రహం ఉంది. గుహలో చక్కని చెక్కడాలున్నాయి. పూర్వం యిచ్చట ఋషులు తపస్సు చేసిన నిదర్శనాలున్నాయి. సప్తఋషుల విగ్రహాలు వరుసగా ఉంటాయి.

## మంగళగిరి



మంగళగిరి గుంటూరు జిల్లాలోదే. గుంటూరు విజయవాడ మార్గంలో ఉంది. యిచ్చటికిబస్సు సౌకర్యమేకాక రైలుస్టేషను కూడా ఉంది. ఇచ్చట వెలసిన దేవుని పేరు పానకాల శ్రీలక్ష్మీ నరసింహస్వామి. ఆయన గుడి కొండమీద ఉంది. 'పానకం' అంటే ఆయనకు ప్రీతి. బిందెతో పానకం పోస్తే సగమే స్వీకరిస్తాడు. మిగిలింది తీర్థంగా యిస్తారు. కొండ దిగువ ఊళ్లో నరసింహస్వామికి చాలా పెద్ద ఆలయం వుంది. గాలిగోపురం ఎత్తుగా

చాలాదూరం కనుపిస్తుంది. దక్షిణ భారతదేశంలో గల గాలిగోపురాల్లో ఈ గోపురమే ఎత్తయినది అంటారు. ఈస్వామికి ఉత్సవాలు అతి వైభవంగా జరుగుతాయి. కొండమీద పానకాల స్వామి ఆలయంలో బెల్లం పానకం ఆలయ మంతా వ్యాపించి ఉన్నా ఈగలు చీమలు కనుపించవు.

అది ఒకప్పుడు చిన్న అగ్నిపర్వతమయి యుంటుంది. జ్వాలా ముఖ ద్వారానికి తిన్నగా స్వామివారి నోరు ఉంటుంది. ఆ కొండలో గంధకం ఉంది. అయితే మనకు ప్రమాదం కలిగించే తీవ్రస్థాయిలో లేదు. ముందు చూపుతో ఆబిలంలో పానకం పోసే ఏర్పాటు గావించి ఉంటారు మన పెద్దలు. అది మంచిదే, దైవంమీద నమ్మకం లేనివారు కూడా పై విషయం దృష్టిలో ఉంచుకుని బెల్లపు పానకం పోయడం మంచిది.

## గుంటూరుజిల్లా పెదకాకాని శ్రీ బ్రమరాంబ సహిత శ్రీ స్వయంభూ శ్రీ మల్లేశ్వర స్వామి వారి దేవస్థానం చరిత్ర

ఒకనాడా భ్రమరాంబికా సఖుడు భవ్యోల్లాసము ప్పొంగ జూ
ప కళాభిజ్ఞులు దార సత్వులు జయ ప్రావీణ్య సంపాదకా
ర్థకృతార్థుల్ప మథాంశ సంభవులు కాం తారాంతరాస్థానసే
వకులౌ చెంచుల చేరికొల్వ మృతయా వ్యాపార మేపారగన్

అని భవిష్యోత్తర పురాణాంధ్రను వాదమైన ఈ పద్యం శ్రీశైల మల్లికార్జునుడు పెదకాకానిలో వెలసిన దివ్యగాధకు నాందీ వాక్యమై విలసిల్లుతున్నది.

శ్రీశైల మల్లికార్జునుడు మృగయా వినోదార్థం చెంచులతో కొంత దూరం వెళ్ళివస్తానని భ్రమరాంబా దేవికి చెప్పి బయలు దేరాడట. అలా బయలు దేరి అనేక క్షేత్రాలు దర్శించి కాకానిలో వెలసినాడని పురాణాలు చెబుతున్నాయి. అయితే మల్లేశ్వరస్వామి హృదయం ఏకాంతర పరిసరాలనే కాంక్షించింది.

మరికొంత దవ్వేగి 'కాకండి' పరిసరాలు తన నివాసానికి అనువుగా ఉన్నవని తలపోసి ఒక పొలంలో వెలసినాడు. దేవగణాలు స్వామిని పూజించాయి. నారద తుంబురులు గానం చేసారు. అప్సరాంగనలు నాట్యం చేసారు. కనుకనే మల్లేశ్వర క్షేత్రాలలో ఇది అగ్రస్థానం వహిస్తున్నది. భక్తకోటిని 'కన్నాకై' కాపాడుతున్నది. అంటే కంటికి రెప్పవలె కాపాడుతున్నది. దీనిని కాకాన్య పురమని దేవతలు పేర్కొన్నారు. కాలక్రమాన ఇది కాకానిగా మారింది.

## మల్లికార్జునస్వామి నామ విశిష్టత

మల్లయుద్ధ విశారదుడై తపోధనులైన ఋషులను బాధిస్తున్న రాక్షసులను పరిమార్చి మల్లులకు ప్రభువై బాసిల్లినందువల్ల కూడా స్వామి మల్లేశ్వరుడు అయ్యెనని కొందరు చెబుతారు. చంద్రగుప్తుడనే రాజుకు చంద్రవతి అనే కుమార్తె ఉండేది. ఆమె శివ భక్తురాలు. ఆమె ప్రతిదినం శంకరుడికి మల్లెపూలతో పూజలు చేస్తూ వుండేది. ఆమె భక్తికి సంతోషించి, శివుడు ఆమెను వరం కోరుకో మన్నాడు. ఆమె తనను పరిగ్రహించమని కోరింది. పరమేశ్వరుడు అనుగ్రహించాడు. 'తెల్లని మల్లెలతో నన్ను పూజించావు కాబట్టి నాకు మల్లికార్జునుడనే పేరు వచ్చింది. "అర్జున" అంటే "తెల్లని" అనిఅర్థం. తెల్లని మల్లెపూలతో పూజింప బడ్డవాడు. కాబట్టి ఆపేరు వచ్చింది.

## భ్రమరాంబ నామము

దేవి భ్రమరకీట న్యాయంతో భక్తులను చూడటం వల్ల భ్రమరాంబ అనే పేరు వచ్చింది. భ్రమరాంబ గురించి ఇంకో కథ కూడా పురాణాల్లో వుంది. అరుణుడు అనే రాక్షసుడు రెండు కాళ్ళు. నాలుగు కాళ్ళు గల వారి చేత తనకు చావురాకుండా బ్రహ్మచేత వరాలు పొంది అందర్ని హింసిస్తూ వుండేవాడు. అప్పుడు అతన్ని సంహరించటానికి శక్తి పూనుకుని కోట్ల కొద్ది తుమ్మెదలు కల పుష్పమాలలతో పుట్టి ఆ భ్రమరాల ద్వారా రాక్షసులను తరిమివేసింది. అందుకని ఆమెకు "భ్రమరాంబ" అని పేరు వచ్చింది.

పెదకాకాని క్షేత్రము నందు విలసిల్లుచున్న శ్రీ భ్రమరాంబా సమేత మల్లేశ్వరస్వామి వారునూ మహామహిమాన్వితులై యున్నవారు. వీరిలో మల్లేశ్వరుడు శ్రీశైల మల్లేశ్వరుని ప్రధానాంశయే గాని మరియొకటి గాదు. ఈ కాకాని క్షేత్రమును గురించి పురాణముల యందు పేర్కొనబడి యుండుటచే నీయది అతి ప్రాచీనమైన మహాక్షేత్రమని వేరే చెప్పనక్కరలేదు. ఈ లింగము శ్రీశైలలింగాంశము కలిగి యుండుటచే ద్వాదశ జ్యోతిర్లింగముల యందలి మహిమ మిందును నెలకొని, దర్శనీయమై యున్నది.

## భరద్వాజ మహాముని క్రతువు

మహర్షి గణములలో నత్యంత ప్రసిద్ధుండగు భరద్వాజ మహాముని ఒకప్పుడు సర్వతీర్థంబులు సేవించుచు, భూప్రదక్షిణం బాచరించుచు, నీ కాకాని మహాక్షేత్రమున కేతెంచినాడు. ఇచ్చటి ఈశ్వరునారాధించు చుండగా, ఆ మహర్షికొక క్రతువు నొనరింప సంకల్పము జనించినది. వెంటనేయాతడు

వలసిన సంభారముల నేర్పరచుకొని, మహర్షి పుంగవుల నాహ్వానించి, యజ్ఞశాలను, క్రతువేది కాదులను, ఉచిత రీతి నమర్చుకొని, యొక సుము హూర్తమున, యజ్ఞసంకల్పముజేసి, సర్వాలంకృతంబగు శాలయందు దేవత లకు హవిర్భాగంబుల నొసంగుచుండ నచటి కొక వాయసమేతించి దేవతల కిచ్చుచున్న హవిస్సుల దానంట'కా' అనుచుండెను.

జరుగుచున్న యీ యపవిత్రను జూచి, భరద్వాజుండు ఆ కాకిని వారింప బోవునంతలో నయ్యది మహర్షితో నిట్లనెను. "భరద్వాజా! నేనే కాకుండను. రాక్షసుండను. సకల జగత్సృష్టి కర్తయగు బ్రహ్మను గూర్చి మహా తపంబాచరించి, యాతనిచే యజ్ఞముల యందు దేవతల కిచ్చు హవిర్భాగంబుల భక్షణంబు జేయునట్లు వరంబు నంది యుంటిని. నన్నేల వారించెదవు? నీవు నీ యజ్ఞమును పూర్తి చేసికొన దలంచితివేని నా మాట విని నేచెప్పినటుల జేయుము. పంచామృతంబులతోను, కృష్ణా గంగోదకంబుల తోను, నవరత్న సువర్ణోదకంబులతోను, పవయానాషు మర్షణ సూక్తంబుల జదువుచు, నన్నభిషేకింపుము. నేనిపుడొక మహర్షి శాపంబు నొంది యుంటిని. ఈశాప మీయభిషేకోదశ ప్రభావంబుచే తొలగి పోగలదు. వెంటనే నాకు మోక్ష ప్రాప్తి కలిగి, నీ యజ్ఞము సురక్షిత మగును". అందుకు గాదనక భరద్వాజుండా భరద్వాజంబున కటులనే అభిషేక మొనర్చెను.

వెంటనే యా కాకము నల్లని రూపమును వీడి తెల్లని వర్ణము కలదై, భరద్వాజుని స్తుతించి, మల్లేశ్వరుని మల్లియలం బూజించి తన యధాస్థానం బగు మానససరోవరము నొడ్డున గల మహాశ్వత్థవృక్షపు తొఱ్ఱలోనికి జేరినది. ప్రతిదిన మీ పక్షిరాజము మానస సరోవరము నుండి ఆకాశ మార్గమున దక్షిణ భారతమున గల పక్షి తీర్ధమునకేగి, అచట గల సర్వేశ్వరుని సేవించి, అచట వైభవమును దర్శించి, బలిని స్వీకరించి, మరలి వెళ్ళుచుండును. ఈ విధముగా వచ్చునపుడు వెళ్ళు నపుడు ఈ కాకాని ఈశ్వరుని గూడ దర్శించుచుండును. ఆకారణమున నీ మహాక్షేత్రమునకు కాకాని క్షేత్రమని నామము కల్గినది. ఈ దేవాలయ ప్రాగ్భాగంబున భరద్వాజునిచే నిర్మింపబడిన కూపంబొకటి కలదు. అందు నా ఋషి పుంగవుడు సమస్త తీర్థంబులను నింపియున్నాడు. ఆ తీర్థంబులిప్పటికిని నిత్యంబులై యున్నవి. నేటికిని ఈ తీర్థంబలు పాప, పునీతంబులగుటయే గాక పసిపాపలు, బాలింతలు, వ్యాధిగ్రస్తులు మొదలగువారు సేవించినచో అమృత ప్రాయంబులై ఆరోగ్య భాగ్యంబలు నొసంగు చుండును.

# చారిత్రక ప్రాధాన్యం

విజయ నగర సామ్రాజ్యాధీశుడైన శ్రీకృష్ణదేవయారలకు సాళువ తిమ్మరుసుతోపాటు, రెంటూరి చిట్టిరుసు అనే మంత్రి కూడా ఉండేవాడు. ఈ చిట్టిరుసు కాకాని వాస్తవ్యుడు. కృష్ణదేవరాయలు దేశంలోని పవిత్ర క్షేత్రాలన్నింటిని దర్శించేవాడు. ఆ ఆలయాలలో మంటప ప్రాకారాదుల నిర్మాణానికి దానధర్మాలు చేస్తూ ఉండేవాడు. ఒకప్పుడు శ్రీశైలం, వేదాద్రి, అమరావతి, విజయవాడ, మంగళగిరులను సందర్శించి అక్కడి నుండి కాకుండికి వెళ్ళి మల్లేశ్వరునకు దేవాలయ ప్రాకారాలను నిర్మించాడు. ఆలయం ముఖమంటపం వద్ద నున్న ఒక శాసనాన్ని బట్టి యిక్కడ ఒక వీరభద్రాలయంకూడా ఉండాలని తోస్తుంది. ఆశాసనంలో "రెంటూరి చిట్టి మంత్రివర మతిరకరో ద్వీరభద్ర ప్రతిష్టాం. లక్కాం భ్బా గర్భ రత్నాకర తుహినకరోమల్లయా మాత్య పుత్రః" అని వుంది. అయితే ఈ వీరభద్రాలయం ఈనాడు ఇక్కడకనిపించడంలేదు. మల్లేశ్వరస్వామి ఆలయనికి కొంత దూరంలో శిధిలావస్థలోఉన్న వీరభద్రుని విగ్రహం ఒకటి కనిపిస్తున్నది.

శాసనంలో మరొక వైపున "స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులు 1440 అగు నేటి బహుధాన్య సంవత్సర శ్రావణ దశమి సోమవారము శ్రీ మన్మహరాజాధి రాజరాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీకృష్ణ దేవమహరాయలు పృథివీ సామ్రాజ్యం చేయు చుండగాను శ్రీ మన్మహాశిరః ప్రధాన సాళువ తిమ్మరసయ్య వారి రాజ్య భార ధురంధరులైన కౌండిన్యస గోత్ర ఆపస్తంబ సూత్రయజుశ్శాఖాధ్యా యులైన రెంటూరి చిట్టిరుసుం గారు కాకాండిని అంగడి వీరేశ్వరునిన్నీ, భద్రకాళిన్నీ, వ్రిషభేశ్వరనిన్నీ, జేయించి ప్రతిష్టలు చేసి గర్భగృహం అంతరాళిక, శిఖరుం మంటపం, ప్రాకారం, గోపురాలు, కళ్యాణవేదిక, పయిడి కుండలు యెత్తించి దేవునికి అంగరంగ వైభవాలను సాగించి కృష్ణదేవ మహారాయలు చేత "వెలింగండ్ల" అనే గ్రామము ఇప్పించి దేవుని నగర ఉత్తరానను చెఱువు కట్టించి, రాతికట్నం గట్టించి, వూరి తూర్పునకు మామిడితోపున్ని, పటమట కాకాండి. వెలిగండ్ల పొలిమేర వెంటనే మామిడి తోపున్ని, పటమట కాకండి వెలిగండ్ల పొలిమేర వెంటను మామిడి తోపున్ను పెట్టించి తన తండ్రి మల్లయరాజుకిన్ని, తమ తల్లి అక్కమ గారికిన్ని తమకునం బుణ్యము గాను ఆ చంద్రాకర స్థాయిగాను నిలిపెను ॥శ్రీశ్రీశ్రీ॥

ఈ శాసనం క్రింద ఒకచంద్రవంక, లింగం, సూర్యుడు, నంది ప్రతిమ లుండడం వల్ల అప్పటికీ మల్లేశ్వర లింగం వెలసి వుండడం వల్లను, మల్లేశ్వర స్వామికి ఆలయం కట్టించడమేకాక, పరివార దేవతలైన వీరభద్ర, భద్రకాళి విగ్రహాలను, నందీశ్వరుని కూడా ప్రతిష్టించి వుంటారని గ్రహించవచ్చు. శ్రీ మల్లేశ్వరునే తీరుమలేశ్వరుడని పేర్కొని వుండవచ్చు.

## శ్రీ వేణుగోపాల స్వామి ఆలయం

మల్లేశ్వరుడిచట లింగమూ వెలయడానికి పూర్వమే యీ క్షేత్ర పాలకుడైన వేణుగోపాలస్వామికి ఆలయం వున్నదని కూడా శాసనాలు తెలుపుతున్నాయి. కాకాండి పట్టణాన్ని మాణిక్యమ్మ అనే రాణి పాలించేదని, ఈ దేవుని ఆమె శాలివాహనశకం 1184 దుందుభి మాఘశుద్ధదశమి గురువారమునాడు ప్రతిష్టించిందని ఒక శాసనం వివరిస్తున్నది. అంటే శ్రీకృష్ణదేవరాయలు ఈ క్షేత్రాన్ని సందర్శించిన నాటికి 256 సం॥లకు పూర్వమే కాకాండి సంస్థానం యిక్కడ వున్నట్లు స్పష్టమౌతున్నది. ఈ స్వామి కీర్తి గోపీనాధుడనేపేర వెలసినాడనీ, మాణిక్యమ్మ కుమారుడు కీర్తి అనే ప్రభువు కూడా స్వామికి సేవలు చేయించాడనీ విదిత మౌతున్నది. దానధర్మాలు చేసిన వారిని పేర్కొంటూ చెన్నమల్లిఖార్జున లింగం, కోటేశ్వరలింగం, కీర్తి గోపీనాథుని అర్చనలు జరిగే ఏర్పాట్లు ఈ శాసనాలలో వివరించ బడినాయి.

"శ్రీమతు కోటి కాకాండి కీర్తి గోపాల దేవర దివ్య కదుపులంబడసి ఇనవరి శ్రీకార్య పరుండు పపమి అల్లాడదాసు" అని శాసనంలో ఉన్నదని, పపమి అల్లాడదాసు శ్రీగోపాల దేవుని ఉపారాధనకు గోవులనిచ్చాడని కూడా ఈ స్తంభం మీద శాసనం వివరిస్తున్నది.

**సోదె :** ప్రతిగురువారము ఇక్కడ ఒకభక్తుడు సోదెచెబుతూ ఉంటాడు. ముందు సోది అడిగిన పిదపనే చాలామంది దేవుని దర్శిస్తారట. ఇపుడు సోది చెబుతున్న వారి పూర్వీకులలో ఒక స్త్రీ భవిష్యత్తులో కలగబోయే శుభాశుభాలను గురించి చెప్పేదట. ఈ నాటికీ ఆ ఆచారం కొనసాగుతూనే వున్నది.

## ఆలయ పునరుద్ధరణ

కాలక్రమంబుననీ క్షేత్రము నందు గల ఆలయము శిధిలావస్థ నొంది యుండ శ్రీకృష్ణదేవరాయల మంత్రివర్యుండగు తిమ్మరుసు మంత్రి జీర్ణోద్ధర

ణము జేయించెను. తదుపరి అదియును జీర్ణావస్థ నొందుటచే హుణశక 1911లో కాకాని గ్రామ వాస్తవ్యులగు శ్రీ కొలిపర వేంకట రత్నము గారు తిరిగి ఆలయ నిర్మాణము గావించి, పునః ప్రతిష్టల జేసి యుండిరి. ఇపుడీ ఆలయమునందు భ్రమరాంబా మల్లేశ్వరులు. గణపతి, వీరభద్రాది మూర్తులు ధ్వజస్తంభము కలవు. ఆలయ దక్షిణభాగమున శివతాండవము, ఉత్తరభాగ మున మహిషాసురు మర్ధని, ద్వారమున కుభయ పార్శ్వముల యందు జయవిజయులు, వినూత్నశిల్పసౌభాగ్యంబుతో ప్రకాశించు చున్నారు. వారియు సుబ్రహ్మణ్యదిక్పాలకాది విగ్రహములు ఆలయ ఈశాన్య భాగంబున గలనింబ సహితాశ్వత్థ మహావృక్షంబు పొంత శోభాయ మానంబులై శ్రీశైలంబు నందువలె దర్శనీయములై యున్నవి.

ఆలయ ప్రాగ్భాగంబునక్వచి దీశాన్యంబుగ కళ్యాణ మంటప మున్నది. స్వామి ఎదుట మధ్య మంటపము నందున్న నందీశ్వరుడు చూడదగి యున్నాడు. బాహ్యామంటపము నందు గొప్ప నందీశ్వరుడు ప్రతిష్ఠింపబడి యున్నాడు. వీరభద్ర స్వామివారి విగ్రహము ప్రాకారమునకు అమర్చబడి యున్నది. పెద్దనంది సమీపమున తిమ్మరుసు మంత్రికి తరువాత తాను పునః ప్రతిష్ఠ జేసినటుల వేంకటరత్నము గారి శిలాశాసనము గూడా నున్నది. ఈ స్వామి వారి దర్శనము భక్త జనులకు సకలాభీష్టముల ననతికాలములో సమకూర్చుచున్నది.

## ప్రస్తుత దేవాలయ పరిస్థితి

మనకు బ్రిటీష్ ప్రభుత్వము తొలగిన పిమ్మట మన ప్రభుత్వము వారు దేశమునగల హిందూ దేవాలయముల స్థితిగతులను విచారించి, దేవాదాయ – ధర్మాదాయ శాఖను ఏర్పరచి, ఆలయ పరిపాలనము జరుప ప్రారంభించిరి. క్రమక్రమముగా అనేక విషయములు బరిశీలించి, చట్టసమ్మతమగు ఉత్తమస్థాయి కైంకర్యములు దేవాలయంబుల యందు జరుగుటకు తగిన వనరుల నేర్పరచి, కార్యక్రమంబుల నెరవేర్చు చున్నారు.

ప్రభుత్వ మీ విషయమందింక ననేక విధంబుల గృషి చేయుచునే యున్నది. అందువలన నీ కాకానిక్షేత్రము పూర్వము కంటే ప్రస్తుతము వినూత్న శోభలతో, అలంకారంబులతో, నిత్యకృత్య కాలవిహిత పూజా పురస్కార మహోత్సవాదులతో విరాజిల్లుచున్నది.

ఇందు గౌరవనీయులగు ధర్మకర్తలు – కార్యనిర్వాహక అధికారులు బహు శ్రద్ధాభక్తులతో ననేక విధములగు వసతులు కల్పించు చున్నారు. యాత్రికులు కవసరమగు గృహ నిర్మాణంబులు, ప్రయాణ సౌకర్యంబులు, విద్యుద్దీపాలంకరణంబులు, నీటి వసతులు, మొదలగునవికల్పించుచున్నారు.

ప్రతి ఉగాది పండుగ రోజున శ్రీ స్వామివారి పేర ప్రకటింపబడు పంచాంగము శ్రీస్వామివారి సమక్షమున వినిపించి,వెలువరింప బడు చున్నది. వత్సరాది నుండి క్రమముగా వచ్చు పర్వదినములందు ఆగమ శాస్త్రవేత్తలచే అర్చాభిషేకాది మహోత్సవములు ఉచితరీతిని జరిపింప బడుచున్నవి. దేవాలయ కార్యనిర్వాహణ కర్తలు అన్ని ఉత్సవములకు కావలసిన వాహనాదులను, వాటి నివాసమునకు దగిన శాలలను ఏర్పాటు చేయించుచున్నారు. ఈ మహోత్సవాదుల వలన రాష్ట్రమునకు, దేశమునకు, ప్రపంచమంతకును ఎంతయో క్షేమకల్యా ణాదులు కలుగుచున్నవి. ఈ కార్యక్రమములచే కొంతమంది నిరుద్యోగులకు ఉపాధులు కూడా కల్పించ బడుచున్నవి. ఈ ఆలయమునందు ప్రతి నిత్యము ప్రభాతసేవ జరుపబడు చున్నది. దేవస్థానము వారు "శ్రీకాకాని మల్లేశ్వర సుప్రభాత" మను పుస్తకమును ప్రకటించి యున్నారు. అందు అనేక విషయములు క్రోడీకరింప బడియున్నవి. ఈ క్షేత్రమున కత్యావశ్యకమగు స్థల పురాణము కూడా తయారు చేయబడి యున్నది. ఈ స్వామివారి మహిమంబు వలన ప్రాంత ప్రజలేగాక సుదూరముల నుండి కూడ భక్తవర్యులు వచ్చి, శ్రీస్వామివారినే సేవించు చున్నారు. అనేక విధములగు మ్రొక్కుబడులు శ్రీ స్వామికి చెల్లించు చున్నారు. ప్రభలు గట్టి ప్రదక్షణంబులు చేయుచున్నారు. మరియు ప్రజలలో దైవచింతన పెంపొం దించు దైవసంకీర్తనలు,భజనలు, నామసప్తాహములు మొదలగు కార్యక్రమ ములు నిత్యము విశేషముగా జరుపబడుచున్నవి. మోటారులు, బస్సులు, జీపులు, కారులు, ట్రాక్టరులు, గోగణంబులు వచ్చి, స్వామిని సేవించుట దర్శనీయముగ నుండును. ప్రజలు వివాహములు, ఉపనయనములు వివిధ కల్యాణోత్సవములు స్వామి సన్నిధిలో జరుపుకొని, ఆనందించి శ్రీ స్వామి యనుగ్రహమునకు పాత్రులగుచున్నారు మరియు ఆంధ్రదేశము నందు మరే దేవాలయము లోనూ కానరాని పొంగలి నివేదనలు ఇచ్చుటి ప్రత్యేకత. ఈ దేవాలయము శివక్షేత్రమైనను శ్రీ సత్యనారాయణ వ్రతములు జరుగుట విశేషము. ఈక్షేత్రమున జరుగు

అన్ని విషయములను ప్రముఖులగు మంత్రివర్యులు, గౌరవనీయులగు శ్రీ కమీషనరు వారు తమసిబ్బందితో కార్యనిర్వాహక వర్గమువారి ద్వారా ఆలయ శోభ నితోధికము చేయు చున్నారు. సర్వసిద్ధిప్రదాతయు, సకలైశ్వర్య సంధాత మునగు శ్రీ మల్లేశ్వర స్వామి వారు తన భక్తుల నందరును అన్ని విధముల సంరక్షించుచు, నిత్య ప్రసన్నుడై యున్నాడు. ఈ దేవాలయమునకు భూ సంబంధమైన ఆదాయం చాలా తక్కువైనను భక్తుల వలన సమర్పించబడు మ్రొక్కుబడులు, కానుకల వలనను, టిక్కెట్ల అమ్మకం ద్వారాను ఆదాయము అధికముగా వచ్చుచున్నది. ఈ దేవాలయమునకు వచ్చు సాలీనాఆదాయము బట్టి 1972వ సంవత్సర ములో ఆంధ్రప్రదేశ్ హిందే దేవాదాయ, ధర్మాదాయ శాఖవారు దీనిని ప్రధమ శ్రేణి దేవాలయముగా ప్రకటించిరి.

## తోట్లవల్లూరు

కృష్ణానది పాయయందు తోట్లవల్లూరు గ్రామము కలదు. ప్రాచీన కాలమున 5 జమ్మిచెట్ల మధ్యనొక పెద్దబావి పూడ్చబడి యుండెననియు శివలంక వరకు ఆరాధ్యులు దానిని త్రవ్వించి అందుగల దేవీ విగ్రహములను నందీశ్వర విగ్రహములు పయికితీసి ఆ ప్రాంతములో నొక శివాలయము నిర్మించి అందీ విగ్రహములను ప్రతిష్టింప జేసియున్నారు. ఇచ్చట స్థాపించ బడిన నందీశ్వరుడు జీవనందీశ్వరుడను పేరు గాంచి యున్నాడు. ఈ నందీశ్వ రుడు రాత్రులందు పంట పొలములపయి పడి పంటలను పాడుచేయు చుండెనని వ్యాప్తిరాగా ఈ ఆలయ ధర్మకర్తలో ఒకరు నందీశ్వరునకు కడియములు కాలికి తగిలించి కదలకుండ చేసినారను ప్రతీతికలదు. ఈ శివాలయములో నందీశ్వరునకు కాలికి కదలుచున్న కడియములు నేటికిని చూపరులకు గానవచ్చుచున్నవి. ఈ జీవనందీశ్వరుని ఇచ్చట ప్రత్యేకముగా ప్రార్ధనలు గావించి కోర్కెలు  ఫలించుకొను ప్రజలు కలరు. బద్దన్న సేనాని ఈ శివాలయమునకు ఉత్పవ విగ్రహములు కల్పించి యున్నారని అచ్చట ఉత్సవవిగ్రహముల వెనుకభాగము నందుగల శిలాశా సనము వలన తెలియుచున్నది. శివకేశవులు ఈ గ్రామములో ఒకరికొకరు ఎదురుగా బహు సన్నిహితముతో నిలిచియుండుట విశేషము.

## ఐలూరు

పూర్వము శ్రీరామచంద్రుని వలన ప్రతిష్ట చేయబడిన రామేశ్వర ప్రసిద్ధిలింగము. ఈ ఐలూరు గ్రామమున కలదు. ఇచ్చట శివరాత్రికి గొప్ప ఉత్సవము జరుగును. ఇట్టిదే చిలుమూరు క్షేత్రం కూడా.

# కూచిపూడి



కూచిపూడి నృత్యం జగద్విఖ్యాతి చెందింది. ఈనృత్యం మన దేశమునందే కాక విదేశములందు సయితము అభ్యసింప బడుచున్న దనుట సత్య దూరము కాదు. ఈ నృత్య మూలపురుషుడు సిద్ధేంద్ర యోగి, అతని జన్మస్థలమే కూచిపూడి. అతడు ఈ గ్రామంలోని బ్రాహ్మణ పుంగవులకీ విద్య నేర్పి ప్రతి యిల్లు ఒక కళాక్షేత్రం గావించినాడు. ఇచ్చటి బ్రాహ్మ ణులను (నృత్యనాటకములందు పాల్గొను వారిని) భాగవతులు అంటారు. భాగవతులంటే భగవత్ కథలను నృత్యగానాలతో కీర్తించువారు అని భావం.

సిద్ధేంద్రయోగి పూర్వాశ్రమ నామము గోపాలకృష్ణభారతి. ఈయన వేదవేదాంగ తత్త్వవేత్త. భాగవతములోని ద్వాదశ స్కంధాలను గేయరూపంలో వ్రాసి వానికి నృత్యాభినయములు చేకూర్చినారు. వీరు క్రీ.శ. 1675 ప్రాంతములో 'భామాకలాపం' అనే నాటకాన్ని రచించారు. శృంగార నాయిక సత్యభామ శ్రీకృష్ణునికై తపించడం దానిలోని యితివృత్తం.

ఈ భామా కలాపాన్ని కూచిపూడిలోని భాగవతుల కుటుంబములోని మగపిల్లవానికి నేర్పి, వానిచేత కనీసం ఒకసారైనా కాలికి గజ్జెకట్టించగలమని సిద్ధేంద్రయోగి ఆ గ్రామవాసులచేత వాగ్దానం చేయించుకున్నాడట. సిద్ధేంద్రయోగి తన బృందముతో గోలుకొండ వెళ్ళి ఆనాటి పాలకు డయిన అబ్దుల్‌హసన్‌తానీషా ఎదుట ఈ నృత్యనాటకాన్ని ప్రదర్శించి, వారి మెప్పు పొంది కూచిపూడిని అక్కడి భాగవతులు శాశ్వతముగా ననుభవించు టకై ఈనాముగా పొందినారు. మనకు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ప్రభుత్వము వారు కూడిపూడిలో సిద్ధేంద్ర కళాక్షేత్రాన్ని ఏర్పరచినారు. ఇచట రామలింగేశ్వ రస్వామి వారి ఆలయము కలదు. దీనిని మున్ను 'కుచేలుడు' ప్రతిష్టించెనని కనుక అప్పటిలో ఈ గ్రామమును 'కుచేలపుర'మని పిలిచెడివారని అంటారు.

(ఈ కూచిపూడి కృష్ణాజిల్లాలో, విజయవాడ, గుడివాడల నుండి వచ్చు నాగాయలంక, అవనిగడ్డ, భావదేవరపల్లి, కోడూరు, హంసలదీవి, చల్లపల్లి వచ్చు బస్సు మార్గములో నున్నది.ఎ.పి.ఎస్. ఆర్.టి.సి. బస్సులన్నీ ఈ గ్రామం మీదుగానే వెడతాయి)

ప్రతి ఫాల్గుణ మాసములో కూచిపూడిలో పెద్ద ఉత్సవము జరుగుతుంది.

## మొవ్వ



మొవ్వలో వెలసిన వేణుగోపాలస్వామి దేవాలయం ప్రాచీన మయినది.

క్షేత్రయ్య పేరు వినని ఆంధ్రు డుండ డంటే అతిశయోక్తి కానేరదు. వీరి మొదట పేరు మొవ్వ వరదయ్య. అతడు భారతా వనినంతా సంచరించి అన్ని పుణ్యక్షేత్ర ములు దర్శించుట చేత అతనికి 'క్షేత్రయ్య' యని నామ మేర్పడినదందురు.

ఇతడు తొలుత వేశ్యాలోలుడుగా నుండెనట. కాలక్రమమున భక్తి ఏర్పడి మొవ్వ గ్రామమందలి వేణుగోపాలస్వామి మీద శృంగార భక్తి మయములగు పదములు రచించెను. ఇతడు అభినయశాస్త్రము నందును తెలుగు సాహిత్యము నందును నిపుణుడు. ఇతడు గాయకుడే గాక స్వయంగా నాట్యం చేసేవాడు. మొవ్వలోని వేణుగోపాలస్వామిని కీర్తిస్తూ ఆధ్యాత్మికతను, శృంగారాన్ని మేళవిస్తూ ఆయన రచించిన పదాల రసజ్ఞులను అప్పటికీ, యిప్పటికీ అలరిస్తూనే వున్నాయి.

ఈతడు క్రీ.శ. 1600–1680 మధ్యకాలంలోని వాడు. క్షేత్రం తంజావూరు విజయరాఘవనాయకుని కొలువులోనూ, మధుర తిరుమల నాయకుని కొలువులోనూ, గోల్కొండ అబ్దుల్ పాదుషా కొలువులోనూ మొవ్వ గోపాలంకితముగ అద్భుతమయిన పదాలు రచించి గానం చేసి అద్వితీయమైన గౌరవము పొందెనట.

## ఘంటసాల



ఇది ఒకప్పుడు గొప్ప బౌద్ధక్షేత్రం. బుద్ధభగవానుని గుర్రం పేరున ఈ గ్రామము నకు 'కంటకశైల' అని పేరు కలిగినట్లు చరిత్రాధారాలున్నాయి. క్రమంగా అది ఘంటసాలగా మారింది.

క్రీస్తుకు పూర్వము నుండియు మనకు ఐరోపా ఖండముతో వ్యాపారసంబంధ ములుగలవు. ఆనాటి వ్యాపారమంతా సముద్ర మార్గాన జరిగేది. ఈజిప్టు దేశసుప్రసిద్ధ ఖగోళశాస్త్రజ్ఞుడయిన

"తోలమీ" ఈ కంటకశైల కృష్ణానదీ ముఖద్వారమున గల ఓడరేవనియు గొప్ప వాణిజ్య కేంద్ర మనియు వ్రాసియున్నారు. ఈ శాస్త్రజ్ఞుడు క్రీస్తుశకము రెండవ శతాబ్దము వాడని తెలియుచుననది. కంటకశైల (ప్రస్తుత ఘంటసాల) ఓడరేవు నుండియే ఇటలీ మొదలగు పాశ్చాత్య దేశములు వజ్రములు, సన్నని నూలు బట్టలు విరివిగ యెగుమతి అగుచుండెడివట. ఆ రోజులలో రోమను నాణెములు మన దేశమునందు విరివిగా చెలామణి అవుచుండెడి వనుటకు నిదర్శనముగా నేటికిని గ్రామములో పాటి దిబ్బలు త్రవ్వినపుడు బంగారు నాణెములు దొరికెనని గ్రామస్తులంటూ ఉంటారు. ఆ నాణెములకు ఒక వైపున రోమన చక్రవర్తి బొమ్మ రెండవ వైపున సముద్రదేవి చిత్రము కలవట. ఈకంటకశైల బందరుకంటే (మచిలీపట్టణం) పురాతన రేవుపట్టణ మట. ఆనాడుగూడురు, కంటకశైల రేవులనుండియే విదేశములకు ఓడల ద్వారా వ్యాపారము జరుగుచెండెడి దనుటకు ఆధారములు కలవు.

క్రీ.శ.పదమూడవ శతాబ్దమునకు కృష్ణానదీ ముఖద్వారము మారుటచే రేవు పోయినందున ఘంసాల ప్రాముఖ్యము తగ్గినది. క్రమంగా క్షీణదశకు చేరుకున్నది. ఎన్నోకట్టడములు, దేవాలయములు శిథిలములయినవి. ఇచ్చట పాటిదిబ్బలు త్రవ్వినపుడు పెక్కు లింగములు, నందులు, యితర విగ్రహ ములు, స్థూపసంబంధమయిన శిలా ఖండములు, శిల్పములు దొరుచుండుట యిందులకు నిదర్శనములుగా నున్నవి. ఇచ్చట కానవచ్చే బౌద్ధస్థూప శిథిలములు, శిల్పములు అమరావతి, జగ్గయ్యపేటలలోని శిల్పముల పోలిక లను కలిగియున్నవి.

పూర్వము ప్రకృతి శక్తులను ఆరాధించెడివారనుటకు గుర్తుగా యిచ్చట పెన్నేరమ్మ ఆలయము, జలధీశ్వరుని ఆలయములు గలవు. నేడు ఘంటసాల గ్రామమునకు మూడువేపుల నున్న గంజికాల్వ అనే గుండేరునే ఆనాటి ప్రజలు పెన్నేరుగా ఆరాధించి ఉండవచ్చు. నావికులు జలధీశ్వరుని తమ్ము క్షేమముగా యిలు చేర్చమని ఆరాధింప ప్రతిష్టించి యుండవచ్చు.

ఇప్పుడున్న జలధీశ్వరుని ఆలయములోని శాసనములను బట్టి ఈ దేవాలయము తొమ్మిదవ శతాబ్దమునకు పూర్వమే నిర్మిలమయినట్లు తెలియుచున్నది. పార్వతీ పరమేశ్వరులు ఏక పీఠమున నుండుట ఈ జలధీశ్వరాలయమున గల విశేషము.సాధారణంగా ప్రతి శివాలయము నందును శివ లింగమే ప్రతిష్టింపబడి ఉంటుంది. ఈ ఆలయముననే శ్రీ

సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ఆలయము కలదు. ఇది క్రీ.శ. 1813లో నిర్మింపబడినది ఇచ్చట ప్రతి సంవత్సరము మార్గశిర శుద్ధషష్ఠికి ఉత్సవం జరుగుతుంది. ఇప్పటికినీ ఘంటసాల చేనేత వస్త్రములకు ప్రసిద్ధి.

## శ్రీకాకుళం



శ్రీకాకుళం ఆంధ్ర సామ్రాజ్యమునకుప్రథమ రాజధానీ నగరం. ఇచ్చట వెలసిన దేవుని పేరు శ్రీకాకుళేశ్వర స్వామి. ఈయనకు ఆంధ్ర విష్ణువనియు, ఆంధ్ర వల్లభుడని, ఆంధ్ర నాయకుడనీ, సిరికాకొలని నాథుడని పేర్లు కలవు.

ఈ స్వామి పట్టమహిషి రాజ్యలక్ష్మీ అమ్మవారు. ఈ దేవుని ఆంధ్ర నాయకుడు తెలుగువల్లభు డనుటచేత – నీతడు మౌర్యవంశానంతరము ఆంధ్ర సామ్రాజ్యమును పాలించిన శాతవాహన వంశీయులలో నొక చక్రవర్తి పేర వెలసియుండవచ్చును అని విమర్శకు లంటారు. ఇచ్చట క్షేత్ర పాలకుడు ఏకరాత్రి ప్రసన్న మల్లిఖార్జునస్వామి. ఒక్క రాత్రి నియమముతో తన్ను ప్రార్థించిన భక్తులకు ప్రసన్నుడై కోరిన వరముల నిచ్చెదనను బిరుదుతో వెలసిన కారణమున ఈ స్వామి ప్రసన్న మల్లిఖార్జునుడని ప్రసిద్ధి చెందినాడు.

శంఖ, చక్రాధ్యాయుధములతో ప్రకాశించుచు భూదేవి, రాజ్యలక్ష్మి అమ్మవారలతో గూడి సకల లోకములను రక్షించుటకు నిలచిన వైకుంఠ నాథుడగు దేవదేవుడు యిచ్చట “శ్రీకాకుళేశ్వరుడు” అను పేరుతో శివారాధన నందుచుండుటవలన ఈ క్షేత్రమునకు ‘శ్రీకాకుళము’ అని పేరు కలిగినది.

తొలుత ఆంధ్ర విష్ణు దేవాలయ, గోపుర మంటపాదులు “శశిబిందు” మహారాజుచే నిర్మించబడినట్లు క్షేత్రమహత్మ్యమున గలదు. ఆ ఆలయము ప్రస్తుత కృష్ణవేణి మధ్యలో ఉండెడిది. ఆది నదిలో కలసిపోగా తిరిగి పునః ప్రతిష్ట గావింపబడింది. అది కూడా కృష్ణలో కలసిపోగా పల్లవ ప్రభువుల కాలమున తిరిగి ప్రతిష్టింపబడినది. అది కూడా కృష్ణవేణి గర్భంలో లీనమయ్యింది. ఇచ్చట మన మొక విషయం గమనించాలి. ఇప్పటివలె అప్పటిలో కృష్ణానదికి పలుచోట్ల ఆనకట్టలు లేవు. తరచు దానికి వరదలు సంభవిస్తూ ఉండేవి. ఆ వరద తీవ్రతలో అది తన మార్గమును కూడా

మార్చుకునేది. ఉన్న మిట్టలను ఎత్తివైచి క్రొత్తచోట్ల మిట్టలను కూర్చేది. ఆ కారణంగానే ఒకప్పటి ఘంటసాల ఓడరేవు మాయమయ్యిందని చెప్పు కున్నాం. ఇచ్చట కూడా పలుసార్లు దేవాలయం వరదల ముంపుకు గురి అయ్యింది.

ఆ తరువాత యిప్పటి ఆలయ గోపురాదులు చోళరాజయిన అనంత దండపాలునిచేత నిర్మింపబడినవి. ఈ దేవాలయంలోని ఆంధ్ర విష్ణు విగ్రహాన్ని శాలివాహన శకం 1205లో శ్రీమురుపళ్ళ అనంతభోగయ్య గారు చేయించిరి. శ్రీ కృష్ణదేవరాయలు క్రీ॥శ॥1519 సంవత్సరములో ఆంధ్రవిష్ణువును దర్శించి నిత్యనైవేద్యములకు 5 గ్రామములు సమర్పించినట్లు శాసనము గలదు. ఈ స్వామి శ్రీకృష్ణ దేవరాయలకు స్వప్నంలో సాక్షాత్కరించి ఆయనను "ఆముక్తమాల్యద" రచింపనాదేశించెను. ఆ ప్రేరణ మీదనే శ్రీకృష్ణదేవరాయలు "ఆముక్త మాల్యద" రచించెనందురు. విజయ నగర పతనానంతరం ఈ క్షేత్రం గోలుకొండ నవాబుల పాలన క్రింద నున్నట్లు తెలియుచున్నది. నవాబుల పాలన అంతరించిన వెనుక దేవరకోట (చల్లపల్లి) ప్రభువులు ఆదేవాలయమును జీర్ణోద్ధరణ గావించి పెక్కు ఈనాము లిచ్చి యున్నారు. నాటినుండి ఈదేవాలయమునకు దేవరకోటప్రభువులు వంశపరంపర ధర్మకర్తలుగా వుంటూ వస్తున్నారు. ఈక్షేత్రానప్రతి సంవత్సరం ముక్కోటికి 'ఉత్తరద్వార దర్శనం' ముఖ్య ఉత్సవంగా ఉంటుంది. బ్రహ్మో త్సవం వైశాఖశుద్ధపౌర్ణమికి జరుగుతుంది. ఈ ఉత్సవమును గూర్చి శ్రీనాథ మహాకవి తన క్రీడాభిరామంలో వర్ణించియున్నాడు.

## పెదకళ్ళేపల్లి



పెదకళ్ళేపల్లి చల్లపల్లికి పది కిలోమీటర్ల దూరంలో కృష్ణాతీరాన ఉన్నది. విజయవాడ నుండి, మచిలీపట్టణం నుండి నేరుగా ఆర్.టి. సి. బస్సులు కలవు. ఇవిగాక చల్లపల్లి నుండి ప్రతి గంటకు బస్సు కలదు.

పెదకళ్ళేపల్లికి "కడలుపల్లి" (సముద్ర ప్రాంతమున నున్న పల్లె) "కదలీపుర మనియు" (అరటితోటలగ్రామమయి యుండవచ్చు)

"రంభా పురి" అనియు (సంస్కృత పండితులు కళ్ళేపల్లికి పెట్టిన నామము) "కర్కోటక క్షేత్ర" మనియు (నాగేశ్వర స్థావర మగుట ఈనామము కలిగి యుండవచ్చు) పేర్లు గలవు. ఈ గ్రామమునకు "దక్షిణ కాశి" అని ప్రసిద్ధి.

'కాశీ' క్షేత్రమందు గంగ ఎట్లు ఉత్తరవాహినియో యిచ్చట కృష్ణ అట్లే ఉత్తరవాహిని. 'కాశీ' ఆనందవనము, యిది కదళీ వనము. 'కాశీ'లో విశ్వేశ్వరుని వలె నిచ్చట క్షేత్రస్థుడు శ్రీ దుర్గా పార్వతీ సహిత నాగేశ్వరస్వామి. క్షేత్రజ్ఞుడు కాలభైరవుడు. కాశీక్షేత్రమందు క్షేత్ర పాలకుడు బిందుమాధువుడు. ఇచట క్షేత్రపాలకుడు మదన గోపాలస్వామి. అచట మణికర్ణికా కుండమువలె యిచట నాగకుండము కలదు. పయి పోలికల లన ఈ గ్రామమును 'దక్షిణ కాశి' అందురు.

పద్మపురాణంలో ఈ క్షేత్రప్రసక్తికలదు. శ్రీరామచంద్రునకు అగస్త్య మహర్షి ఈక్షేత్రమహత్మ్యమును చెప్పినాడుట. ఈ క్షేత్రమునకు సంబంధించిన పౌరాణిక కథ ఈ క్రింది విధముగా నున్నది.

ఈ పురమున కశ్యప ప్రజాపతి పుత్రులగు కర్కోటక, వాసుక, తక్షక, శంఖచూడ, ధృతరాష్ట్ర, శంఖపాల, ధనంజయ, పింగళులను అష్టఫణి రాజులు తల్లియగు కద్రువ శాపవిముక్తికయి ఒక శిలావేదికను నిర్మించి నాలుగు ప్రక్కల ఆచ్ఛాదనముగానుండుటకయి కదళీతరువుల బాదుకొలిపి, ఈశాన్యభాగమున గోముఖాకారంలో నొక సరోవరమును నిర్మించిరి. వారు ఆ సరోవరమందు స్నానమాచరించి యనుష్ఠానముల నిర్వర్తించుకొని శివుని పూర్వోక్త మండప మధ్యమున బ్రతిష్ఠించి నియమముగ ప్రతిదినము పూజ చేయుచుండిరి. అంతట శివుడుగన్నులకు మిరుమిట్లు గొలుపుచు, అంబర తలము వరకు వ్యాపించిన శరీరము యొక్క ఒత్తిడికి ప్రక్కల నున్న కదళీ షడంబులెల్ల పెళ పెళారావంబులతో నొక్కమారు క్రిందబడు శ్రీ దుర్గా, పార్వతీ సహితుడయి పరమేశ్వరుడు లింగ మధ్యమున ఆవిర్భవించెను.

వారును ఆ మహారభసంబున కులికిపడి వింతగొలుపనొకరి నొకరు హెచ్చరించుకొనుచు "కదళీకదళీ" అని కేకలిడసాగిరి. చంద్ర శేఖరుడు వారి యమాయకత్వమునకు సంతసించి "భోగేంద్రులారా! మీ తపంబునకు మెచ్చితిరి. మీ తల్లి యొసగిన శాపంబునకు భయపడ వలదు. ఆస్తీకుడు మిమ్ము జనమేజయ యజ్ఞవాటంబున రక్షించగలడు కావున మీరు నిశ్చింతగా నుండుడు. మరియు నేనుద్భవించు సమయమున మీరు ఆశ్చర్యము

నొంది"కదళీకదళీ" అనికేకలువయిచిరి గాన మీమాటలు ఆచంద్ర తారార్క ముగా నుండునట్లు ఇక్కడ "కదళీ పుర" మను పేర నొక పురంబు కీర్తిగాంచు" అని పలికెను. అప్పటి నుంచి ఈ గ్రామమునకు 'కదళీపురము' అని ప్రసిద్ధి గాంచినది. సంస్కృత పండితులు చల్లపల్లికి 'తక్రపురి' అనియు మచిలీపట్టణ మునకు 'మత్స్యపురి' అనియు అవినట్లుగనే కళ్ళేపల్లికి 'రంభాపురి' అని నామకణ మొనర్చిరి.

శివుడు శ్రీశైలమందు మల్లిఖార్జునుడుగను రామేశ్వరమునందు రామలింగేశ్వరుడుగను, అమరావతి యందు అమరేశ్వరుడుగను, మధుర యందు సుందరేశ్వరుడుగను, కాశీయందు విశ్వేశ్వరుడుగను, చిదంబర మందున నటరాజేశ్వరుడుగను, హిమాలయమునందు గౌరీ శంకరుడుగను, కాశ్మీరము నందు సోమనాథుడుగను నారాధింపబడు చుండ పెదకళ్ళేపల్లిలో నాగేశ్వరుడుగా పూజలందుచున్నాడు. ఈ దేవాలయమునకు సంబంధించిన శాసనములు చాలగలవు. అందు కొన్ని...

1) శాలివాహనశకము 1062 (క్రీ.శ. 1140) శాసన సారాంశము: శాలివాహనశకము 1062 సం॥నకు సరియగు మాఖ బహుళ చతుర్ధశినాడు ముక్కంటిరాజు భూమి నేలునపుడు తత్పూర్వము ఆంధ్రదేశమున శివాలయ ములలో గల వైదికేతరములగు పూజావిధానములను నిలుపుదలగావించి విష్ణ్వాలయములందువలె వైదిక పద్ధతిని అర్చనాదులు జరుపుటకు తగిన ఏర్పాట్లు మెకంజీదొర చేయించెను. వారీ శాసనమును బందరు పురమందలి గొడుగుపేటలోని శాంతమల్లేశ్వరస్వామివారి ఆలయ అర్చకుల నుండి సేకరించిరట. నాటినుండి పంచారామములందును, కదళీపురక్షేత్ర మందును, పట్టిసమందును, గోకర్ణమందును,కౌండిన్య–భారద్వాజాది గోత్రముల వారగు వెలనాటి బ్రాహ్మణోత్తములు అర్చకులుగా నియమింపబడిరి.

2) శాలివాహనశకము 1078 (క్రీ.శ. 1154) శాసనము నందు చంద్రవంశ క్షత్రియులగు బల్లభూపాలుని పుత్రుడును, దిలీపసముడు నునగు చాళుక్య భీముడను ప్రభువునకును కబ్బలదేవికిని బుట్టిన జ్యేష్ట కుమారుడు భారత, భాగీరథాధి చక్రవర్తుల బోలిన వాడగు బల్లాదినాథుండను ప్రభువరే ణ్యున కిల్లాలయిన సోమలదేవి అను భక్తురాలు ఈ కడలుపల్లి నాగేశ్వర స్వామికి ఆచంద్రతారార్కముగా నఖండ దీపము లిచ్చెననియున్నది. ఈ శాసనములు శ్రీ నాగేశ్వరస్వామి ఆలయములోని రాతిస్థంభముల మీద

చెక్కబడి, దక్షిణ ఇండియా శాసనావళిలోని ఆరవ వాల్యూమ్‌లో 87, 88 నెంబర్లుగా నమోదు చేయబడినవి.

3) క్రీ.శ. 1288, 1291, 1315 సంవత్సరములనాటి శాసనములు స్వామి ఆలయమందును, వీరభద్రస్వామి మంటప స్థంభములపయి నున్నవి. వీనిని బట్టి ఉయ్యసాని, తొండసెట్టి, సూరపరెడ్డి చేతరెడ్డి అను వారలు స్వామివారికి సంక్రాంతి పుణ్యకాలమున అఖండ దీపమునకుగాను ఒక్కొక్కరు 25 మాడలు ఏర్పాట్లు చేసినట్లు తెలుపబడినది.

4) శాలివాహన శకము 1214 (క్రీ.శ. 1292) శాసనమున ఈ క్రింది విధముగా నున్నది.

"స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర కాకతీయ కుమార రుద్రదేవ మహా రాజులు రాజ్యం సేయగాను. శ్రీ మత్పుష్పగిరి మఠ సాంతావికులైన శ్రీమతు సోమశివాచార్యులు జన మేజయ సర్పయాగ స్థానమునందు అనంత వాసుక కర్కోటకమహానాగ కుమారులచేత సుప్రతిష్ఠ దివ్యలింగమయిన కడలుపురి నాగేశ్వర శ్రీమన్మహాదేవరకు శకవర్షంబులు అగు నేటి నందన సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి గురువారము నాడీ గుడి కట్టించినారు."

ఈశాసనము శ్రీనాగేశ్వరస్వామి గర్భగుడి దక్షిణప్రకారమునశ్రీ సోమ శివాచార్యుల విగ్రహము క్రింద నున్నది. "వీరు శ్రీనాగేశ్వరశ్రీ మన్మహాదే వరకు ఈగుడికట్టించి, ఈస్థాన మేలిన సోమశివా చార్యులు" అని విగ్రహము క్రిందనే పేరున్నది.

5) గర్భగృహ ముఖమంటపమునకు మొదటి స్థంభము మీద గల శాసనమువలన శుభాశుభ సమయములందు ఏర్పడుతగాయిదాలు తీర్చుట కును, అందులకు కావలసిన చట్టములు చేయుటకును నేటి కోర్టులవలె నీ దేవాలయము ఆనాడు ప్రజల కుపయోగపడుచుండెనని తెలియుచున్నది. ఆ శాసనము క్రీ.శ.1790లోఒక పెండ్లివారి తగాయిదాకు సంబంధించినది.

క్రీ.శ. 1288, 1291,1315,1790 సంవత్సరముల నాటి శాసన ములు 4 మదరాసు లోకల్ రికార్డ్స్ వాల్యూమ్ 589 పుటలో రికార్డు చేయబడినది. ఈ శాసనమువలన శ్రీ సోమ శివాచార్యుల వారు నిర్మించిన దేవాలయము శిథిలముకాగా, వారి యనంతరము 490 సంవత్సరములకు అనగా క్రీ.శ. 1782లో తిరిగి యార్లగడ్డ కోదండరామన్న దేశాయిగారు జీర్ణోద్ధరణము గావించినట్లు తెలియుచున్నది.

7) కోడందరామన్న ప్రభువుగారి యనంతరము వారి మూడవ కుమారుడున్నూ పెడన పరిగణాధిపతియున్ను అగు శ్రీరాజానాగేశ్వర నాయుడు బహద్దుర్‌ప్రభువువారు క్రీ.శ. 1795లో శ్రీదుర్గానాగేశ్వర స్వామివారి ఆలయమునకు గోపుర ప్రాకారములు కట్టించిరి. ఇందుకు సంబంధించిప శాసనము గోపురము లోపలి భాగంలో పడమట దిక్కున కలదు. నాటినుండి ఈ దేవాలయమునకు వంశపారంపర్య ధర్మకర్తలుగా శ్రీ దేవరకోట (చల్లపల్లి) ప్రభువులు ఉంటూ వస్తున్నారు. ఆలయమునకు దక్షిణ భాగమున సత్యస్తంభమను పేరుగల రెండుగజముల ఎత్తుగల రాతి స్తంభమొకటి గలదు. దీనిపయిన బౌద్ధచిహ్నములగు ధర్మచక్రములు నాలుగువైపుల నున్నవి.

బుద్ధం శరణం గచ్ఛామి ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి

అను బౌద్ధమత సూత్రములలో గల సత్యపదము లున్నవి. దీనిని బట్టి ఇది కూడా ఒకప్పుడు బౌద్ధమత క్షేత్రమయి యుండవచ్చు. పూర్వం ఎవ్వరయినను సత్యముకోరి ప్రమాణము చేయవలసి వచ్చినపుడు ఈ స్తంభము వద్దకు వచ్చి ప్రదక్షిణముచేసి నిలుచుండినచో సత్యమే అతని నోటివెంట వచ్చుచుండెడిదట. అసత్యము పలుక నోరాడు కుండెడిదట. అట్లు అనృతమాడినచో వారికేదియో విపత్తు కలుగునని భయపడుచుండెడి వారట. ఒకప్పుడు వర్తకులిద్దరు తమ మధ్య కలిగిన ఒక వివాదమును పరిష్కరించుకొనుటకు ఈ సత్య సత్యస్తంభము వద్దకు వచ్చిరట. వారిలో నొకడు "అబద్ధమాడిన ఈ రాళ్ళేమి చేయునో చూచెదనని" గర్వముతో నసత్యము పలికెనట. వెంటనే ఆ స్తంభయు యొక్క పయి భాగము సగము విరిగి మీదపడి ఆ వర్తకుడు మరణించెనట. మనకు యిపుడు ఆ స్తంభము సగము మాత్రమే కనిపించుచున్నది. ఈ కలీపురమున విశ్వామిత్రుడేగాక వశిష్ఠమహర్షి కూడా తపస్సు చేసినట్లు తెలియుచున్నది. ఇచ్చట మహాశివరాత్రికి బ్రహ్మోత్సవములు అతి వైభవముగా జరుగును. ఇచ్చట గల మదన గోపాలస్వామి ఆలయము విశ్వామిత్రుడు తానే స్వయముగా నిర్మాణము గావించి రుక్మిణి, సత్యభామ సమేతుడగు శ్రీ గోపాలదేవుని ప్రతిష్ఠించెను. ఈ స్వామికి ప్రతి సంవత్సరము ఫాల్గుణ శుద్ధ పూర్ణిమకు కళ్యాణోత్సవములు జరుగును.

# మోక్షప్రదాత మోపిదేవి విధాత



మోపిదేవికి మోహినీపురమను మరియొక పేరు కలదు. ఇచ్చట వెలసిన దైవము సుబ్రహ్మణ్యేశ్వరుడు. ఈస్వామిని సేవించిన పుత్రులు లేనివారికి పుత్రుడు కలుగుదురని ప్రజలవిశ్వాసం. ఇచ్చట సకలేశ్వర స్వామి క్షేత్రపాలకుడు. ఈ క్షేత్రమును గురించి శ్రీ స్కాందపురాణమున సహ్యాద్రి ఖండమునందు ప్రసక్తి కలదు. ఈక్షేత్రమున ప్రతి సంవత్సరము మాఘ శుద్ధ షష్ఠికి బ్రహ్మోత్సవాలు జరుగును. ఇచ్చటికి నిత్యము భక్తులు బహు దూరము నుండి సయితము వచ్చి తమ పిల్లలకు, పుట్టు వెంట్రుకలు తీయుట, చెవులు కుట్టించుట, అక్షరాభ్యాసము చేయుట గావించుచుందురు.

కృష్ణాజిల్లా మోపిదేవి మండలం మోపిదేవి గ్రామంలో వెలసియున్న శ్రీ వల్లీ దేవ సేనాసమేత శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వారి దేవస్థాన వైభవం. ఈ ప్రదేశమునకు మొదట మోహినీపురము అని పేరు. "మోహ యతీతి మోహినీ"

భక్తి భావము కలిగించి దూర జనులను ఆకర్షించి రప్పించుకొనే ప్రదేశము కాబట్టి ఈ ప్రాంతము మోహినీపురమై కాలగతిని మోపిదేవిగా ప్రసిద్ధి కెక్కింది. వల్మీకముల మధ్య "షణ్ముఖుని" కనుగొని లోకమునకు ఎరుక వఱచినది అగస్త్య మహర్షి. ఇక్కడ అగస్త్య మహర్షి శివలింగమును ప్రతిష్ఠించాడు."వీరారపు పర్వతాలు" అనే కుమ్మరిభక్తుడు 'కుమారస్వామి' తన కలయందు కన్పించి ప్రబోధించినట్లే సుబ్రహ్మణ్యేశ్వరునికి ఒక గుడి కట్టించి సేవించి తరించాడు. ఈ కుమ్మరి, స్వామికి ప్రీతియగు అశ్వము, మయూరము నంది, మహాయోగుల విగ్రహములు మొదలగునవి. మట్టితో చేసి సహజత్వము పోకుండా దేవున కొసంగినాడు. ఆ భక్తుడు సమర్పించిన కానులలో అశ్వము, నంది యిప్పటికి యున్నవి. కుమారుని రక్షణ కోసమే అవతరించాడన్నట్లు పరమేశ్వరుడు ఇక్కడ స్వయంభువుడై సకలేశ్వరుడన్న పేరుతో క్షేత్రపాలన చూస్తున్నాడు.

ఆశ్రితజనవత్సలుడై భక్తుల పాలిటి కొంగుబంగారమై విలసిల్లే సుబ్రహ్మణ్యేశ్వరుని మహిమలు అన్ని ఇన్నని చెప్పలేము. ఈయన ప్రత్యక్షదైవ మని, నాగుపాము రూపములో ఆలయంలో అప్పుడప్పుడూ దర్శనమిస్తాడు అని అనేకమంది భక్తుల అనుభవము. ఈ క్షేత్రములో ఒక మండల కాలము నియమంతో ప్రదక్షిణలొనర్చిన, పాపాలు నశించి పుణ్యము లభిస్తుంది. సంతానం లేని వారికి సంతానం కల్గుతుంది. చెవికి సంబంధించిన వ్యాధులు నివారణ అగును. ఇది క్షేత్ర మహిమ.

స్వామియొక్క లింగస్వరూపములో వేయి సర్పాకారములు ఇమిడియుండుటచే, ఈస్వామిని వేయి పడగలస్వామి అని కూడ కొలిచెదరు. ఈ విషయము తెనాలి వాస్తవ్యులు శ్రీ అన్నపూర్ణ సిద్ధాంతిగారు నిరూపణ చేసారు. ఈ దేవస్థానమునకు చల్లపల్లి జమీందారులు భక్తితో అనేక ధన, కనక వస్తు, వాహనములు సమర్పించినారు. వీరే ఈ దేవ స్థానమునకు వంశ పారంపర్య ధర్మకర్తలు. ఇప్పుడు శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దర్ గారి కుమారుడు శ్రీమంతు రాజా మల్లికార్జున ప్రసాద్ వంశపారంపర్య ధర్తకర్త. వీరి కర్తృత్వములో నిత్యము జరుగు పూజా కార్యక్రమములతో బాటు, ప్రతి సంవత్సరం మాఘమాసంలో ప్రత్యేక ఉత్సవాలు, స్వామి వారి కల్యాణము ఈ దేవస్థానములో రంగరంగవైభవముగా జరుగు చున్నది.

## హంసల దీవి



హంసలదీవి కృష్ణానది సాగరుని కౌగిలిలో చేరు పరమపవిత్ర స్థలం ఈ సంగమ సుందర దృశ్యం ఎవ్వరికి వారు కనులార తిలకించి ఆనందింప తగ్గదేగాని మాటలతో వర్ణించుట కష్టసాధ్యము. ప్రతి ఏటా మాఘ పౌర్ణమికి భక్తులు వేల సంఖ్యలో సంగమ స్థలములో స్నానాదులు కావించుటకు వస్తారు.

ఇచ్చటి సముద్రములో జరాసంధుడను రాక్షసుని కోట కలదని అంటారు. పూర్వము ఒకప్పుడు పెక్కు పాపములు చేసి కాకిరూపు పొందెననియు అతడు యిచ్చటకు వచ్చి స్నానమాచరింపగా హంసగా మారెననియు, అందువలన ఈ గ్రామమునకు 'హంసలదీవి' అని నామ మేర్పడిందనియు పెద్దలు చెపుతారు.

ఒకప్పుడు 'హంస'లు ఉండేవని పౌరాణిక కథలే కాకుండా బుద్ధుని చరిత్రలో కూడా తెలుస్తోంది. ఆదిమానవుడు కేవలం ఆహారం కొరకే వేట కొనసాగించేవాడు. అది ప్రకృతి సిద్ధాంతరీత్యా నేరంకాదు. ఎందువల్లనంటే ప్రకృతిలో ప్రతి ప్రాణి మరొక ప్రాణిపయి ఆధారపడి యుంది. కాని నాగరికత పెరిగిన కొలది వినోదం కొరకు వేట కొనసాగించారు. సహజంగా ప్రకృతి జీవుల సమతుల్యతను, తుఫానులు, వరదలు, భూకంపాలు, వ్యాధుల రూపంతో నియంత్రిస్తుంది. ప్రకృతి నియంత్రణ వల్లను, మానవుల క్రౌర్య క్రీడలవలనను అనేక ప్రాచీన జంతు జాలం పూర్తిగా నశించింది. కొన్ని ప్రమాదస్థాయికి చేరువలో ఉన్నవి.

అందుకే మన ప్రియతమ ప్రధాని, శాంతిదూత కీ॥శే॥ పండిత జవహర్లాల్ నెహ్రూ అన్నారు. "షూట్ దెమ్ నాట్ విత్ గన్, విత్ కెమెరా" అని పక్షులను జంతువులను తుపాకితో కాల్చక కెమరాతో బంధించమని, ఎంత చక్కటి నినాదం! మన ఆర్యులు నిర్ణయించిన అన్ని కర్మకాండలలోనూ భూతదయ, జీవకారుణ్యం నిండి ఉంటుంది. నీ సాటివారితోబాటు సకల జీవరాశుల సుఖశాంతులు కోరినపుడే నీకవి లభిస్తాయి. ఇది అక్షర సత్యం.

## శ్రీకృష్ణవేణీ దేవతా పూజా విధిః

ఆచమ్యా : ప్రాణానామయ్య ఏవంగుణ... తిథే సార్ధత్రికోటి తీర్థ సహిత పుష్కర మహాపర్వణి శ్రీకృష్ణవేణీ నదీ దేవతా పూజ్యాం కరిష్యే.

కలశపూజాం,గణాధిపపూజాంచకృత్వా శ్రీకృష్ణవేణి దేవతాం ధ్యాయేత్.
పద్మాశ్యాం పద్మ పత్రాక్షిం పద్మగర్భ స్వరూపిణీం
చింతయే త్పద్మచరణం పద్మాసన వివేసనీం
కృష్ణవేణీ హృదిధ్యాయే త్పరమాత్మ స్వరూపిణీమ్ ॥

శ్రీకృష్ణవేణీ నదీదేవతాయై నమః ధ్యాయామి, ఆవాహయామి, రత్న సింహాసనం సమర్పయామి, పాద్యం సమర్పయామి ఆర్ఘ్యం సమర్పయామి, పంచామృత స్నానం సమర్పయామి, శుద్ధోదక స్నానం సమర్పయామి, హరిద్రాం సమర్పయామి, కుంకుం సమర్పయామి, పుష్పానిసమర్పయామి, అక్షతాన్‌సమర్పయామి ఆభరణం సమర్పయామి.

ఓం శ్రీకృష్ణాయైనమః ఓం మహాదేవ్యై నమః ఓం సహ్యాద్రి ప్రభూతాయై నమః ఓంనదీమాతృకాయై నమః ఓంపాపవినాశిన్యైనమః ఓంశ్రీ మద్గిరివరాయై నమః ఓం సమస్తమౌని సంసేవ్యాయై నమః ఓం సర్వాభీష్ట ఫలప్రదాయై నమః ఓం బ్రహ్మహత్యాది పాపౌఘ వినాశిన్యైనః ఓం సకలాగమ సంవేద్యాయై నమః ఓం

శ్రీకృష్ణవేణినదీ దేవతాయైనమః నానావిధ పరిమళ పుష్పాక్షితాన్ సమర్పయామి, ధూప మాఘ్రాపయామి, దీపం దర్శయామి, ధూపదీపానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి, నైవేద్యం దద్వాత్ ఉత్తరాపోసనం సమర్పయామి, కర్పూర నీరాజనం సమర్పయామి, మంత్ర పుష్పం సమర్పయామి, ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.

## ప్రసన్నార్ఘ్య మంత్రము

గంధ పుష్పాక్షతైర్యుక్తం కుంకుమాన్విత ముత్తమమ్ ప్రసన్నార్ఘ్యం మయాదత్తం సగృహాణ పరిద్యరే॥ శ్రీకృష్ణవేణీ నదీ దేవతాయై నమః ప్రసన్నార్ఘ్యం సమర్పయామి.

సువాసిన్యై శూర్పవాయనదానం

సువస్త్రం కంచుకోపేతం ఫలాదివ్యంజనాన్వితమ్

శూర్పదానం కరిష్యామి త్వత్ప్రీత్యై పరమేశ్వరీ ॥

ఇతి శూర్పవాయనం సువాసిన్యైదద్యాత్ ఆనయా ధ్యానా వాహనాది సర్వోపచరా పూజయా భగవతీ సర్వాత్మికా కృష్ణవేణీ దేవతా సుప్రీతా సుప్రసన్నా వరదాభవతు.

### తాత్కలికపిండ ప్రధానవిధి

సోలెడుపిండిని మూడు పిండములుగా నుంచి ఎవరెవరికి పిండ ప్రదానం చేయదలచామో వారినందర్నీ స్మరించి ఆవాహన చేసిఅవసర నైవేద్యముగా బెల్లం ముక్కను వుంచాలి. కర్మానంతరం రెండు దర్భ పుల్లలూ నాలుగు నువ్వులతోసహా పిండాలను కృష్ణానదిలో కలిపివేయ వలెను.

**పొత్తరలు :** పొయ్యి పెట్టడం వండడం వగయిరాలు చేయడానికి అవకాశం లేనివారు పొత్తరలను యిచ్చినా తిధితుల్యమయిన పుణ్యాన్ని యిస్తుందని వారి విశ్వాసం. సహజంగా ఈ పొత్తరలు 9వ రోజున యిస్తారు. కాని పుష్కర సమయంలో ఆ పన్నెండు రోజులలో ఏ రోజు పొత్తరలు యిచ్చినా, పిండప్రదానాదులు చేసినా తప్పులేదని శాస్త్రకారులు చెబుతున్నారు.

## తీర్థశ్రద్ధ సంకల్పం

ఏవంగుణ.... శుభ తిధౌ, మమ పిత్రుణాం శాశ్వత బ్రహ్మలోక నివాస సిద్ధ్యర్థం... పిత్రు పితామహ ప్రపితామహానాం... గోత్రాణాం... శర్మాణాం వసురుద్రా దిత్యరూపాణాం మాతృ... గురోః, దూర్విలోచన సంజ్ఞకానాం విశ్వేషాం దేవానాంచ ప్రీత్యర్థ్యం కన్యాగతే దేవగురౌ సార్థత్రి కోటితీర్థ సహిత పుష్కర మహాపర్వ ప్రయుక్త కృష్ణవేణీ తీర్థసహిత పుష్కర మహాపర్వ ప్రయుక్త కృష్ణవేణి తీర్థశ్రాద్ధం అన్నేన హవిషాసదైవమధ్య కరిష్యే అని సంకల్పించి తీర్థశ్రాద్ధ ప్రయోగమును సక్రమముగా చేయవలయును.

